STAGE DRAMA

స్టేజి డ్రామా.

# పుష్పరాజ్యం

లేక

## రాధాకృష్ణ.




గ్రంథకర్తలు:

[illegible]

శ్రీరస్తు.

# పుష్పరాజ్య

లేక

# రాధాకృష్ణ

(ఐదంకముల సాంఘిక నాటకము)


గ్రంథకర్తలు:

అల్లూరి రామజోగిరాజు

చిరంజీవి సూర్యనారాయణరాజు.



మొదటికూర్పు 250.

పబ్లిషరు,

**అల్లూరి రామజోగిరాజు,**

**రాయలం.**

శ్రీ రాజేశ్వరీ ప్రెస్‌నందు ముద్రింపబడియె

రాజమండ్రి

1944

ఈ నాటకము యొక్క సర్వహక్కులు, నాప్రియమిత్రులును, కళాభిమానులును, నటకులు నయిన శ్రీ అల్లూరి రామజోగిరాజుగారికి ఇచ్చి వేయడమయినది. నాకు యీ నాటకముపై ఎటువంటి స్వాతంత్రము లేదు.

ఇట్లు,
చిరంజీవి, సూర్యనారాయణరాజు.

ఈ " పుష్పరాజ్యం " నాటకముయొక్క కాపీరైటు సర్వహక్కులు నాకు చెందియున్నవి. కావున నా వ్రాతమూలకమైన పర్మిషన్ లేనిదే ఏ సంఘమువారుగాని, యేసినిమానటులుగాని ప్రదర్శింపరాదు.

మరియు గ్రామఫోనురికార్డింగు, టాకీప్రింటింగు, ఇతరభాషలలోనికి తర్జుమా వగైరాలుచేయగూడదు. అట్లు అతిక్రమించినవారలకు జరుపు సివిల్ క్రిమినలు చర్యలకు బాధ్యులగుదురని ఇందుమూలముగా తెలియజేయడమైనది.

ఇట్లు,
అల్లూరి రామజోగిరాజు,
రాయలం, భీమవరంతాలూకా, ప॥ గో॥ జి॥

రాయలం
4—5—44

# ఈ నాటకమునందువచ్చు పాత్రలు.

పురుషులు.

1 కృష్ణారావు—కథానాయకుడు (రాధభర్త)

2 రాఘవరావు—కథానాయకుని గార్డియన్

3 రామ్ శెట్టి } స్నేహితులు
4 శాస్త్రి }

5 యోగి—గొప్పభక్తుఁడు

6 వెంకటరమణ—కృష్ణారావు [illegible]

స్త్రీలు.

1 రాధ—కథానాయిక

2 పుష్పం—వేశ్య

3 సీతామహాలక్ష్మి—శెట్టిభార్య

# పీఠిక.

ఈ పుస్తకము వ్రాయుటకు మాకు ప్రోత్సాహమిచ్చి మా అభివృద్ధిని కోరువారును, గురుసమానులు నగు మురారి దేవసహాయం బి. ఏ. బి. ఇ. డి. గారికిని, కొంపెల్ల కృష్ణమూర్తి గారికిని మేమెంతయు కృతజ్ఞులము.

ఈనాటకము మేము రచించిన వెనుక పంచభాషాప్రవీణ, విద్వాన్ శ్రీ సూర్యప్రకాశశర్మ బి. ఏ. బి. ఇ. డి. గారికి చదివి వినిపించితిమి. వారు మాయందు స్నేహభావముంచి పలుమార్పులను పద్య గద్యములందు జేసిరి. దానికి మేమెంతయు కృతజ్ఞులము.

ఇట్లు,

గ్రంథకర్తలు.

# పండితాభిప్రాయము

శ్రీ అల్లూరి రామయోగిరాజు, చిరంజీవి సూర్యనారాయణరాజు నాన్న తాము రచించిన "పుష్పరాజ్యం లేక రాధాకృష్ణ" యను సాంఘిక నాటకమును జదివి వినిపించిరి. అది సాంఘిక నాటకమేనైనను హిందూమత రహస్యములెన్నియో వెదజల్లబడుట గానబడును.

కథానాయకుడు రాధావల్లభుడేయైనను యీనాటకమునందు తగు హాస్యము, భావగర్భితములగు పద్యములు, రక్తమునుడికెత్తించు వచనములు, వహ్వాయనిపింపదగు దృశ్యములు రంగస్థలినను భవము కవికుమారులకుగలదనుటకు దగు దృశ్యములకూర్పు. భావిని కవికుమారులకలములనుండి యనుపమనాటకరాజములు వెల్వడునాశ యాంధ్రులకు గల్గకమానదు. శ్రీశుడు వీరికట్టిశక్తి నిచ్చుగాత! యని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,

పంచభాషా ప్రవీణ, విద్వాన్ అ॥ సూర్యప్రకాశశర్మ
బి. యె. బి. ఇడి. టీచరు.

యు. యల్. సి. యం. హైస్కూలు, భీమవరం

# అంకితము.

బున వేంకటరాజుగారు

సకలసద్గుణ పూజితుల్ జనకుల స్మ

ృతివృద్ధికి దోహదంబిచ్చు ఘనులు

చరణబ్జములకెపుడు ప్రణుతులిత్తు.

చంద్రావతమ్మ మదంబపుత్ర

నయరాజిత బీదలనెల్ల ప్రీతి

ప్రేమించు లాలించు నతివయామె

చరణముల మ్రొక్కుచుందు మస్తకముచేర్చి.

॥ ..ాంబిక గన్నవర రత్నమాలలో

నున్నతపదవిని నుండె నెవడు

...ముల ..ణ ప్రథిత సజ్జనులందు

దల నాల్కుచందాన మెలగె నెవడు

..ల్వారి వంశాబ్ధి నబ్జుడీ తండన

బాంధవ స్తోత్రాల వరలె నెవడు

..శంబు సేవించి శ్రీశు సేవింపగా

సంసారమునువీడి చను నెవండు

..టి రామచంద్రావు మదగ్రజుండు

దేశభక్తుడు భక్తుడు దీనజనుల

బ్రోవ వెనుకంజవేయని పుణ్యశాలి

యతని చరణంబులకు నతులప్పగింతు.



# పుష్పరాజ్యం లేక రాధాకృష్ణ.

## ప్రథమాంకము.

### మొదటిరంగము— ఒంటరిగదిలో.

కృష్ణం— (కూర్చుని) దైవమే ప్రేమ. ప్రేమయే దైవము. కాబట్టి ప్రేమించడమంటే రాంగ్ కాదన్నమాట! మరి తప్పేమిటి? తప్పనేది ప్రపంచములోనే లేదు. అంతామంచే. అసలువంగా "మైట్ ఈజ్ రైట్" "స్వబుద్ధి సుఖం చైవ" మనసుకు తట్టింది ప్రతీదీ మంచిదే. ఈ కొశ్చన్ సాల్వుచేయలేక ప్రపంచమంతా తన్నుకుచస్తుంది. "ధనంమూలం మిదం జగత్" ప్రతి పురుషుడుగాని, స్త్రీగాని సుఖంగా నుండవలెనన్న ధనమత్యావసరం. అదిలేనిదే యేపనీజరుగదు. మానవుడు పశుప్రాయుడైనను, ధనమే ధైర్యమును, తెలివిని, అందమును, మర్యాదను మంచిని తెస్తుంది. అందుచే మనమేదో విధంగా ధనమార్జించాలి. (వాట్ ఈజ్ ది వె) మార్గమేమిటి? స్త్రీ తల్చుకుంటే కానిదుండా? స్త్రీని చూచుసరికి శివునంతటి మహానుభావుని కైనా శివమెక్కుతుంది. స్త్రీ కోరిక ఏపురుషుడు కాదనగలడు? ఇందుకు పౌరాణిక తార్కాణములు లేవా?

సంతసమొప్ప వశిష్టుతో బ్రహ్మపదము
బొందు తపమొనరించి సామ్రాజ్యమునియె,
మేనకనుజూచి నంతనే మానితపము,
స్వర్గసుఖమునువీడి యా సతినిగొనడె?

మన గ్రామములో ఘనవంతుడైన కృష్ణారావుగారు నా! మొన్న బజారులో నన్నుజూచి పిచ్చిపిచ్చి చేష్టలు చేయడం మొదలు పెట్టినాడు. అతని 'లక్కు' నెమ్మదిగా వృద్ధిజేసి క్షేమించినట్లు నటించామంటే మనకేమీ కొరతయుండదు. తండ్రికూడా లేడు. వ్యాపారమంతయు, అతగాడే చక్కజేసి కొంటున్నాడు. అటుపైగా మొన్న సినిమాహాలులో నొకరినొకరు మరి యొకరము కనుచున్నప్పుడు నేనొకగ్లాసు వేసేటప్పటికి ఉబ్బితబ్బిబయ్యాడు. రిప్లయి-రీసైటిక్-ఇక నేమి! మనదొత్తునాగిందా కనకవర్షం కురిసిందన్నమాటే! అనుమానమెందుకు? అదిగో గడియారంకూడా హుషారిస్తోంది. (చూచి) ఎవరు? కృష్ణారావా! ఏమినాభాగ్యము. (ఎదురేగి) ఓహో! నమస్తే కృష్ణపరమాత్మ! నవనీతచోరా!

అంత కృష్ణారావు (ప్రవేశించి)

కృష్ణ—నవనీత చౌర్యమేమికర్మం? మధురాతి మధురమైన మానసం దనే లభ్యమౌతుంటే;

మాణిక్యం—ఇలా కుర్చీలోనికి దయచేయండి!

కృష్ణ—(స్వగతము) గొప్పచిక్కే వచ్చింది. శెట్టి, శాస్త్రి నచ్చుటనె యుంటామని మోసంచేశాడు. ఇప్పుడద్వైర్యమంతా మందిగా భోలు. ఏవిధంగా ప్రాపికెను మావ్ చేసేది! (ఆలోచన నభినయించి) ఓ గుడ్ ఐడియా!

పుష్పం——ఏమండి కృష్ణారావుగారు! అలా నేరుగా వచ్చేస్తున్నారు. ఏదో పనిమీద వచ్చినట్లుంది. సెలవియ్యరూ!

కృష్ణ——పనిమీదనే వచ్చాను. నిరాకరణ యుండదని!

పుష్పం——నిరాకరణా! అబ్బే! ఎంతమాట? అజ్ఞాపించండి!

కృష్ణ——అజ్ఞాపించడమా? మీవంటి సర్వజ్ఞులను. 'స్వేచ్ఛాప్రేమ' సమంజసమా? అసమంజసమా? యను శీర్షికపై నొక మీటింగు జరుపనుండి, మిమ్ముల నాసమావేశమునకు ఓపెనర్‌గా నాహ్వానించడానికి నేనే స్వయంగా వచ్చాను. ఆసందర్భమున మన మిత్రులు కొందరిచే నొక నాటికకూడా ప్రదర్శింపబడును.

పుష్పం——వెరీగుడ్ సబ్జక్టు! మంచివిషయమే పెట్టదల్చారండి! ఈరోజులలో పురుషులు ... క్షమించండి! స్త్రీలు కొంచెం మాట్లాడితే చాలు. చులకనగా చూస్తారు. "చాలబాగుందండీ" అంటూ ఎక్స్ప్రెషన్ కోసం దేవులాడుతారు.

కృష్ణ——(జేబునుండి కాగితముదీసి) యదార్థం గ్రహించారు. ఇదిగో చూడండి! ఎక్స్ప్రెషన్ కోసం అప్లికేషన్ సెండ్చేసిబై లీలావతి! ఈలాగే వుంటూవుండు పరస్పరంగా! మీరు తప్పకరావాలి సుమా!

పుష్పం——అబ్బా! అంతగా ప్రార్థన ఎందుకండీ! మీటింగుకి?

కృష్ణ——మీటింగు ఓపెన్ చేసిపెట్టటానికేగా ఈ ప్రార్థన!

పుష్పం——కాని ఒక్కసందేహం! ఆ సమావేశానికి పెద్దలంతా వస్తారుగదా! నావంటి స్త్రీ ఓపెనర్‌గా... ...

కృష్ణ——వైనాట్? ఎందుకు బాగుండదు? మీరు తెలివిలో తక్కువా? గుణములో తక్కువా? రూపంలో తక్కువా?

పుష్పం——మీరు చెప్పిన వేవీకావు. ఒక్కటేనాకధైర్యం! మొదటిగ స్త్రీని—రెండవది నెలయాలివృత్తి!

కృష్ణ—ఓస్ ! ఇదా నీభయం-చూడు.

నేటిదినములయువతియే ; నేర్చి సకల
కళల నడిపించు సంఘుంబు కచ్చగట్టి
కళలబోషించి నేర్పింప గలదువేశ్య,
వారవనితవు, యువతివి ! వలదుభీతి.

పుష్పం—ఎక్సలెంటు ! నాసందేహాన్ని నిమిషంలో నివృత్తిచేశారు. నాదోకోరిక-కాదనరని నాధైర్యం.

కృష్ణ— ఓ ! తప్పక ! వాట్ ఈజ్ ఇట్ (స్వగతం) అందుకేగా వచ్చింది ?

పుష్పం—కాస్త "టీ" పుచ్చుకోని... ...

కృష్ణ—నీచేతితో యేదియిచ్చినా అమృతతుల్యం, యేది ?

పుష్పం—(టీ తెచ్చుచుండును.)

కృష్ణ—ఆ, ఆ, నీవే స్వయంగా తెస్తున్నావా ? ఆ, నీ కోమలకరంబులు కరము వేడిమికి కందిపోతాయ్ ! సహాయం చేస్తానుండు (అని లేచును.)

పుష్ప—అబ్బా ! (కప్పను విడచును) (నిర్ఘాంతపోయి ప్రణయ చూపులు)

కృష్ణ—"నెవర్ మైండ్" కమాన్ కూర్చొండి, అలాగా నిలబడ్డావ్ ! (చేయి పట్టుకొనును).

పుష్పం—అబ్బా ఒడలు అదోలాగుండండీ ! చేయి వదలండీ !

కృష్ణ—నా చేయంత కఠినంగాఉందా ?

పుష్పం—కఠినంగానుండదూ ! పురుషులు మీరుఎవ్వరైనాచూస్తే...

కృష్ణ—(తనలో) స్త్రీ ఆవిధంగా పల్కిందంటే ! మెత్తబడిందన్నమాటే,

(ప్రకాశముగా) ఏమనుకుంటారు ? అనుకోవలసిందే అనుకుం
టాను. మరి-ఇకనాకు సెలవా ? (ప్రణయమూర్ఛలు)

పుష్పం---(చేయిబట్టుకొని) కూర్చుందురూ ! ఏమంత తొందరపను
లున్నాయా !

కృష్ణ---(కూర్చొని) ఇక సెలవా ? చాలా తొందరపనులున్నాయ్.

పుష్పం---మరల దర్శనమెప్పుడో ! మర్చిపోకండి...(ప్రేమ)

కృష్ణ---మర్చిపోవడమే ? రేపు నాల్గు గంటలకు. (తనలో) కాసేపు
మాట్లాడితేనే బాగుండేలాగుంది. (ఒకరినొకరు ప్రేమదృష్టుల
వీక్షించుచు వెడలుదురు.

తెరవాలును.

---

రెండవరంగము---కృష్ణారావు గృహము

(సాయంసమయము కృష్ణ విగ్రహము చెంత రాధ
పాడుచు పూజ చేయుచుండెను)

రాధ---కృష్ణా ! నీకరుణ మా దంపతులపైనుండబట్టే ఎంతయు నానం
దము ననుభవించుచున్నాము, నీదయ యుండుటచేతనే గదా
నేను సుఖముగా నాభర్తతో కాపురముచేయుచుంటిని, నావం
టి యనుకూల దాంపత్యవతి లేదనియే నాగర్వము, ఆహా !
ఏమి నీదయ.

రారా నా దరి జేరుము కృష్ణా
గోపాల బాలక మాం పాహి
ముద్దుల నీదరా మోహన కృష్ణా
రాధా మానసచోరా ! రా రా---రా రా ॥రా॥

కృష్ణ—(వెనుక నుండి)

రాధా! ప్రేమ మయి మీరా గాక
కాదా నాదరి జేరవిదేలా
ప్రేమ చూపుల బరపవిదేలా
లేదా ప్రేమ నాపై నీమెద ॥రా॥

(ఇరువురు చేయీ చేయీ పట్టుకొని)

రాధ—అబ్బా! కృష్ణుని లాగేయున్నారే?

కృష్ణ—నీవు రాధవేగా!

రాధ—కృష్ణునకు నెమలిపింఛము లేదెందుచేతనో!

కృష్ణ—గోపికా లోలునకేగా నెమలిపింఛము!

రాధ—(కూర్చుండ బెట్టి పై పాటను పాడును)

కృష్ణ—రాధా! అబ్బాయి యేడి?

రాధ—ఇప్పుడే నౌకర్నిచ్చి బయటకు పంపించాను, కాస్సేపు గాలిలో తిరిగి వస్తాడని, ఏం! పిలిపించమంటారా?

కృష్ణ—ఏమీ లేదు! అక్షరాభ్యాసము ఈ నెలలో చేయించిన బాగుండునేమో!

రాధ—మీయిష్టము వచ్చినట్లు చేయించండి 'ఆత్మబుద్ధి సుఖంచైవ' మను నారోక్తి లేదా! నాకూ సంతోషమే! నా రాధను సంతసింప జేయుటయు నెక కాలమున సాధ్యమగునుకదా!

భర్త సంతసంబె భార్య సంతోషంబు;
భర్త సుఖముగాదె భార్య బలము;
భర్త పూజగాదె భారతీ రమణికి;
నిత్య మోక్షమిచ్చు నియమి తలచు;

కృష్ణ—చల్లగాలికి బయటికి వెలదామా? రాధా! (వెళ్లుదురు)

శా. స్త్రీ—ఓరి! వీళ్లదుంపతెగా! పిల్లచ్చంగా రాధాకృష్ణులమనే పు
లిసిపోతున్నారు! ఇదేమి ప్రేమరాగాయనా! ఎప్పుడుచూచినా
ఆటలు, పాటలూను. వీళ్ళిద్దరిలోను ఒకరికికాకపోతే మరొకరికై
నా కాస్తసిగ్గుండవద్దూ!

శాస్త్రి—(ప్రవేశం) యూనియన్ స్తంభంలా నిలబడి ఏదో గొణుక్కుంటు
న్నావే ముండాకొడుకు!

శా. స్త్రీ—మగడు యెప్పుడువస్తాడాయని యీమె తపించడం! యింటికి
రెప్పుడురుకదామాయని, యాతడు తహ తహ లాడడం! ఆడీ
కాకుండా కలవగానే చేతులూ చేతులు పట్టుకొని ప్రేమగీతా
లు పాడడం, అబ్బబ్బే అంతకూడదు, నేను మాయాయనగాడను
న్నామంటే— మరి యిల్లాగా?

శాస్త్రి—అవును వీని ముఖాన్ని ప్రతికూల దాంపత్యమేగా వ్రాసియుంట
వాళ్ళ ప్రేమ జోలి వీడికెందుకు? వీనికిమాత్రం ప్రేమలేదా?
మొన్ననోసారి నేను వాళ్ల యింటికి, వెళ్ళేసరికి శాస్త్రిగారి
టోన్ హై పిచ్చిలోనుంది, ఏమిటా? అని నిలబడ్డా; వాళ్ళు
విడని ఇనపలవ్ చేస్తూ; నేను ఆఫీసర్ననుకో, ఆఫీసుకుటైమయింది
సంటకాలేను అని అంటూ, యతి ప్రాస లేని పద్యం మొదలు
పెట్టాను. ఆహా యేమి గొప్పగా వుందండీ!

టైము గతించుచున్న యదిసుదతినాకు
ఆఫీస్కు అరగుటకు అతి నయంబున
ఇంతకు అరటిపోవు యేకంపు కొట్టదు
యెట్టులరుగువాడ శరభముఖిరో!

పైగా, మనోహారిణీ, నాయమంగు ప్రేయసీ, కనక్...
దొడ్డికి వెళ్ళుటకు కాలమతిక్రమించె "అలస్యాదమృతం విషం"

అను నార్యోక్తి వినమే! అంటూ పెద్ద పెద్ద సమాసాలు వాడేసి తన ప్రేమను ప్రవహింప చేస్తాను! ఏకే ఇనపలవ్ ఎవ్వడికి తెలియదనుకుంటాను. (వీపుతట్టి) నమస్తే, శాస్త్రీజీ! ఏమిటో యూహిస్తూన్నట్లుంది! ఏదైనా కవిత్వమా బాబు? ఏనాటికి మో వ్రాసి యతిప్రాసలు లేకుండా గ్రామ్య భాషలో గ్రంథం వేయించాలనా! నీ యాలోచన! ఇంకే! కావలసినంతధనం.

శా|| స్త్రీ—నీవుకూడా ఏదైనా వ్రాయ్! చిన్నప్పుడు మంచి తెలివిగా నుండేవాడివిగా, క్లాసుల్లో?

శె|| — దటీజ్ కోయిట్ రైటనుకోండి! కాని యిప్పుడు అదంతా అమ్మగారి వశమయింది. ఇంకెక్కడి తెలివి? శాస్త్రులుగారికి కూడాను. నీకు తెలియదంటయ్యా ఏదో అంటారు "వివాహే విద్యానాశాయ, సర్వనాశాయ శోభనం." అంతేనా?

శా|| స్త్రీ—విద్యానాశంకాదు. సర్వనాశంకాదు. (తనలో) ముండాకొడుకు తాటాకులు కడుతున్నాడు. శెట్టీ! కృష్ణారావుచూడు. ఎప్పుడు భార్యతో...

శెట్టి—వాళ్ళ పరస్పరానురాగం, నీకేమి తెలుసు. గువ్వల జంటలాగ వారిద్దరెన్నడొకర్నొకర్ని విడిచి, మరియొకరుండరు. మీలాగవారికి ఎడమొహం, పెడమొహం లేదు.

శా|| స్త్రీ—ఏమిటోరి మో! అర్థంలేని ప్రేమ. ప్రేమంటే ఒకరి నొకరు మెలివేసుకొని కూర్చోడమా?

శెట్టి—అబ్బే! అదేమి ప్రేమ. ఇంటివద్ద ఇనపలవ్ నేను యాక్టుచేయడమే ప్రేమగాని, నీవు నీవంటున్నానని ఏమీ అనుకోకు. మనమిద్దరం ఒకేపాలి బూడిదలో ఏలుపెట్టిన స్వతంత్రాన్ని అంటున్నాను. (తనలో) వీడు పుష్పం యింటికి మాతిరుగుతున్నా

అని తెలిసింది. శాస్త్రీ! నీవు ఏకపత్నీవ్రతుడవా? లేక బహు
పత్నీ అః

శాస్త్రి—ఏసమయమందుచూచినా ఏకపత్నీ వ్రతుడనే. (తనలో) కనిపెట్టాడా యేమి?

శెట్టి— ఎప్పుడుచూచినా ఏకపత్నీవ్రతుడవేగాని, ఒకేపత్నీ మాత్రంగాదు--కాదూ? కాకపోవడమేమి? పాతికేండ్ల ము శాకొండుకువి. అన్నీ సన్యాసంచేశావా?

శాస్త్రి—(తనలో) త్వరగా వెళ్ళిపోవుటమంచిది. (ప్రకాశముగా) పోతాను శెట్టీ సెలవియున్నది.

శెట్టి—ఉండదుమరీ! కానిబాబూ మైమరచియుండకండి? రోజులు బాగుండ లేదు. గడపలు త్రొక్కడంలోమాత్రం జాగ్రత!

సీ॥ చెవులువిప్పి శ్రద్ధ ♦ చేర్చి రహస్యాలు
ఘోషించి బెదరించు ♦ కుడ్యతతులు
వచ్చి పోయెడువారి ♦ పాద చిహ్నంబుల
గుర్తించి యోజించు ♦ గుమ్మములును
వారకాంతల గొంప ♦ ప్రాప్తించు నవమాన
తోరణంబులఁ దెల్పు ♦ తోరణములు
కొట్టితగాదాలు ♦ ఖూనీలు హత్యలు
సూచించు కంబాల ♦ సోయగములు
మఱచిపోవద్దు శాస్త్రిగు ♦ మర్మాలదాటు
నపుడు ప్రాప్తించు కష్టాల ♦ నంద చంద
ములను దిలకించి భ్రమియించి ♦ ముందుపోని
తెలియనేరని సాలీడు ♦ వలె జరించి.

(వెళ్లుదురు.)

పుష్పరాజ్యం.

మహిమ! దీనిని ఎవ్వరు వర్ణించుటకు దీనిరుచితో పరిచయము లేని ఆ ముదుసలి బ్రహ్మకైనను తరమా? పుష్పం నిన్నే లు మరువలేను, దీని ప్రభావమేమోగాని. లోన తిరుగునే స్ఫూర్తి, రక్తప్రసారమధికమై, నఖశిఖపర్యంతము "ఈ మధుసేవ" కూడా దేశములో నొక శాసనము క్రింద బెట్టి, ప్రతిమానవుని శరీరారోగ్యానికి, మనోధైర్యానికి, మానాభిమానాల మరపడానికి ఇది మందని... అశోక చక్రవర్తి బౌద్ధమత వ్యాప్తికై బోధకుల నియోగించినట్లు, ప్రచారకుల నియోగించి, ఊరూర ప్రచారం చేయించి ప్రశస్తి నొంది, కీర్తికాంతను వరించియుండేవాడను. కవిత్వంకూడా పుడుతోంది.

(మైమరచును)

వృద్ధ—ఇప్పటికి మనవలలో చిక్కినట్లే! (ముందుకు వచ్చి)

సీ॥ ఇదిగదా తగుమందు ♦ యెంతవానినినైన
వశపర్చుకొని యెడ్డి ♦ వన్నెలాడి
ఇదిగదా యెంతటి ♦ హీన లోభినిగాని
కర్ణుని మరపించు ♦ కన్నెపడుచు
ఇదిగదా యెంతటి ♦ వీరవంతునినైన
భీరువుగను జేయు ♦ వెలదితలప
ఇదిగదా యెంతటి ♦ యుత్తమేధావంతు
నైన పిచ్చివానిగ జేయు ♦ నేణనయన
ఆ॥ వె॥ ఇదియె చాలు పురుషు ♦ హీనునిగా జేయ
కులుకుపొందుగూడ ♦ గలిసెనేని
వేరె చెప్పవలెన ♦ తెజ నగ్నికి వాయు
వమరి సఖ్యలగును ♦ వసుధయందు.

([illegible] అంతా ఆలాగు పాడుచు ప్రవేశించును. తెరవడును.)

# నాల్గవ రంగము.

(శెట్టిగృహమున లక్ష్మిపూజచేయుచుందురు.)

శెట్టి—ఏమేవ్! నాయనా! అబ్బాయీ! అది యిల్లా తీసుకురా! ఏరా? వినిపించడంలేదు? రావేం?

సీత—అబ్బ! మన బ్రతుకు బంగారంగాను మనకి అబ్బాయి కూడాను? మన తెలివికి, బడాయికి!

శెట్టి— అబ్బాయికేమిలోటే వెర్రిమొగమా! మనంతల్చుకున్నాం మంచే! ఊరికే సరదాకలా పిల్చాను.

సీత—తల్చుకుంటేను, తల్చుకుంటే అంటారు! తల్చుకొని ఏదోవిధంగా ఒక పిల్లాణ్ణి కనరాదూ! లింగూ, లిటుగూ, అంటూ ఊరకనే ట్టీన మంచంకోళ్లలాయుండకపోతే!

శెట్టి—ఏమిటే పొగరుబోతా! నన్నే కనమంటున్నావ్? సరేకాని పిల్లలు లేకపోవడం యెంతమంచిదో తెల్సునా? తరుణీ! నీలవేణీ! ఓ పోరుంచదు, పోట్లుండదు

సుతులు లేనియన్నాళ్ళైపో ♦ సుఖముకల్గు
నేకశయ్యను బవళించి ♦ నిరుపద్ర నెప్పుడు
కౌగలింతల రేయెల్ల ♦ గడపుచుంట
వారుకల్గిన సౌఖ్యంబు ♦ భగ్నమగును.

ఈ సుఖం నీకక్కర లేదంటావా, నామీద నమ్మకం లేకపోతే... పోనీ నువ్వు... యే పెద్దింటమ్మ గుడివెనకాలో, నరసింహస్వామి గుడివెనకాలో, అప్పన్నకొండవెనకో సాష్టాంగ పడదాం!

శెట్టి—నీకదణ్ణంపెడతాను కొట్టకేవ్! అలా ఎందుకు యాక్టుచేశా నంటే నాటకంలో ఏపాత్రియితే ధరిస్తామో, ఆపాత్రియే నేన నుకొని, నటించాలి కాని రాంశెట్టి అనిమాత్రిం అనుకోవద్దని డైరక్టరుగారు మరీ మరీ నొక్కిచెప్పారు. (కొట్టుటమానును)

శా స్త్రి—ట్రియిల్ వేసి చూసినందుక్కు వీపులు చెడినా, మంచి ప్రాక్టీ సువచ్చింది. నేపోతాను. నీవిక మేటసివెయ్యి. (పోవును)

సి—వాడల్లా ఎందుకు కూశాడు-పోతూపోతూ చెప్పవేం? (... పట్టుకొని తీసుకువెళ్లును.)

తెర ప్రాలును.

---

ఐదవరంగము.

(కృష్ణారావుయిల్లు--రాధ పాడుచుండును.)

రాధ—(స్వగతము) ఏమిది? ఇంతవరాలేదు, గ్రామాంతరము పోయి యుండుర్రా! ఏ స్నేహితునికడనైనపోయియుండురా? ఏమిస తంనైయుండును? బేలనై నా నాథుని తడయక కై నింతగా నీచ త్వముచే, దిగులొందనేల? పురుషులు బహువ్యాపార నిమ గ్నులు, దీనికై నే నింతగా నన్యథాచూతురము, ఔందనవసరము లేదు! ఎవరు? (చూచును)

కృష్ణ—(తూలుచు) ఏయ్! అలాచూస్తావేం? దేవతవా? శేక ... యానివా? అంతున్నావేమిటి?

రాధ—(నిర్ఘాంతపోయి) ఏమిది! హేళనయూ! ఎక్కడనుండి నావసం

(పరికించి) ఇదేమిచిత్రం? రూపు మారినట్లున్న దే? శీకటిలో వంటరిగా వచ్చేటప్పటి దేదైనదయా వరించిందా?

కృష్ణ—ఏయ్! ఇంకా నిలబడ్డావ్! వెళ్లవ్! నన్ను భ్రమింపుతావా? నీకాళ్ళకు మ్రొక్కుతా! వెళ్లు తల్లీ!

రాధ—అయ్యోరామా! ఇదేమి? నాథా! ఈమాటేమిటో నాకర్థం కావడంలేదు? నన్నాడిస్తున్నారా? లేక (సమీపించి)

కృష్ణ—స్టెండ్-దేర్. మీదకొస్తే ఆంజనేయదండకం ప్రయోగిస్తా (చదువును)

రాధ—గ్రహింపునభినయించి నిక్కముగా నన్నాటలాడించుచున్నారు మీకొక రహస్యం చెప్పనా?

కృష్ణ—సోదిరహస్యం! నీ రహస్యం ఎవరికికావాలి! దయయుంచినన్ను మాట్లాడకు; నీకంఠస్వరం, వినేసరికి కంపంజనిస్తోంది! ఆహా! ఏమిఅవతారమండీ!

రాధ—ఇదియేమికర్మము! దైవమా! ఇదివరకెన్నడిట్లు నన్ను తృణీకరించి యుండలేదే?

కృష్ణ—(త్రాగని వానివలె నటించును) అబ్బే! ఏమీలేదు!.......

రాధ—(సమీపించి) సంగతి విశదమైనది, ఇంత పాడు స్నేహితులే కారణమైయుండును.

రాఘు—(ప్రవేశము) ఏమమ్మాయి.ఎంతటి యర్థరాత్రియును కృష్ణారా నెచ్చటినుండి వచ్చినాడు, అవైఖరి ఏమిటి?

రాధ—అటుచూడుముబాబు! వారెట్లున్నారో?

రాఘు—(పరికించును)

కృష్ణ—ఒకటి రెండైనవి, పోతురాజు-మారెమ్మా, పోతురాజు నన్ను దయ చూడవూ? (లేవ యత్నించు కూలును)

—(సమీపించి) అమ్మా! భయపడకు! ఇదిగో! సువాసన గొట్టుచున్నది, పాడు స్నేహితులు ఎంతటి బుద్ధిమంతులైనను, హీన స్థితికి తేగలరు, త్రాగినట్లున్నది, ఆహా! సురాదేవతా!

సీ॥ సిల్కు పరుపుపైన ♦ కుక్కకుఁ సుకుమారు
నిద్ర బుచ్చినావు ♦ నేల పైన
ముద్దు లొలికెడిభార్య ♦ ముఖము జూచిన యంత
మారెమ్మ యంచును ♦ మప్పినావు
కష్ట సుఖంబుల ♦ గమనించు మనుజుఁ బి
పోతురాజునే యన ♦ బొల్చినావు
అర్ధాంగి నే కంట ♦ నరయుచుండిన
తల్లి భావనమది ♦ దాల్చినావు
సారకన్నె నీకు ♦ సాష్టాంగదండముల్
సృష్టి తల్లక్రింద ♦ జేతువుగదె
యిట్టి శక్తి నీకు ♦ నిడినయాయీశ్వరు
ననగవలయునిన్ను ♦ నాడ నేల

లోన బరుండ బెట్టుదము రమ్ము.

(ఇరువురు తీసుకొని పోవుదురు)





# పుష్పరాజ్యం లేక రాధాకృష్ణ.

## ద్వితీయాంకము.

### మొదటిరంగము—వీధిసీను.

(శెట్టి-శాస్త్రి ఇరువురు నొంటరిగ చేరియొక ప్రక్క నుండి.)
(ఒకరికొకరు చూడకుందురు.)

శెట్టి—కృష్ణారావు పుష్పంయింటికి వెళ్ళడానికి నాకీయాందోళన కలగడానికి కారణం, నా స్వయకృతాపరాధమే. ఏదో ప్రెండు గదా! మంచివాడు అని పుష్పం సంగతి మాటవరుసన చెప్పాను. కాని, అంతటి గుణవంతుడైన కృష్ణారావు దీనివలలో ఎల్లాచిక్కేడో? ఎవడెలా మెచ్చినా మన పెట్టుబడికి నష్టం లేకుండా దాన్ని న్యాయమారినా జాబిబుజ్జ ఉంటాయని పని చెయ్యాలి. గోడలకు చెవులు, కళ్ళు ఉంటాయని మా అయ్యమ్మ చెప్పేది. చడిచప్పుడు లేకుంట ఎవరికంటా పడకుండా ఉడాయించాలి.

శాస్త్రి—నేనంటే పుష్పానికి చాలఇష్టం. కృష్ణారావు, శెట్టి ఒకరిక తెలియకుండా మరియొకరు వెడుతున్నారు. కాని మనకాతా

వారికి తెలియును. ఇప్పుడు చాల తెలివిగాను గూఢంగాను ప్రప్పం టైమ్ టేబిల్ మార్చాలి! క్లాక్ రాండా! (ఇరువురు ఎదురుబదురై నిర్ఘాంత పోవుదురు)

ఏమదెయ్యా! శెట్టీ ఎంతవరకు ప్రయాణం ?

శెట్టి—అయితే నీవు బ్రాహ్మడవుగండా! ప్రయాణమై వెళ్ళేటప్పుడు డల్లా అడక్కూడదు శకున పక్షిలా అని తెలియదూ ?

శా|స్త్రి—అసలు నీ ప్రయాణంపూర్వ పక్షం చెయ్యాలనే!

శెట్టి—అనేమిటీ! నా ప్రయాణం నువ్వాపడమేమిటి ?

శా|స్త్రి—ఎక్కడికి వెళుతున్నావ్ ? అనిఅడక్కూడదని నాకు తెలుసు కాని, పాపం వ్యాపారం నిమిత్తం వెళ్ళేవాడికి ఒంటి బ్రహ్మణ్ణి నే నెదురయ్యానేమాయని చింతిస్తూ, పోనీ ఒకటికి మరియొక దుశ్శకునం అయితే వేరొక సుశ్శకున మవుతుందని అట్లా అడిగాను, కోపంవచ్చిందా ?

శెట్టి—కోపమా! దాన్ని చంపుకునేగా తిరుగుతుంటా!

శా|స్త్రి—నీ కడుపు చల్లగా యదార్థం వచ్చింది నీ నోట, నా కొక్క సందేహం పీకిపిస్తోంది! అదినవృత్తి కావాలి! చేస్తావా ?

శెట్టి—ఓహోహం! పైమరీగాను జేటీనే చెప్పేదేంటి ?

శా|స్త్రి—లోకానుభవాన్కి చదువుకి చాలా తేడావుంది! అయితే వ్యభిచారాన్ని గూర్చి నీని యభిప్రా శ్రీ వేంకటేశ్వర విద్యాలయ

శెట్టి—ఏమిటీ!... ...నీ ప్రశ్నేమిటి ? గ్రంథాలయం

శా|స్త్రి—వ్యభిచరించడం సమంజసముంటావా? నమోదు సంఖ్య 6284

శెట్టి—ఆఛ్ఛీ! ఎదవ పని! దగుల్బాజీ పని! తేదీ 26-6-1986

శా|స్త్రి—మరి మనకు కావలసిన స్నేహితుడొకడు యింటరంభలాటి భార్యనుంచుకొని వ్యభిచరిస్తోంటే వాని శ్రేయస్సుకోరే హితుడు

వాణ్ణి అల్లరిపెట్టడం ఎందుకంటే, నన్నే అనుమానపడ్డానా? అలాంటి అనుమానంపడకు. నీమీదనాకూ అనుమానంలేదు. నువుసొగల స్నేహంచేత కంగారుపడి అడిగాను.

శ్రోత్రి—అసలు నేమఱచిపోయాను. మళ్ళీ జ్ఞాపకం చేస్తున్నావ్ వెళ్ళి పోతాను.

శాస్త్రి—మరివెళ్ళిరా! నాకూ పనుంది.

తెరవాలును.

---

# రెండవరంగము.

(పుష్పం ఇల్లు. శాస్త్రి కుర్చీలోకూర్చుంటాను.)

శాస్త్రి—అమ్మయ్యా! నాకికి టోకరాయిచ్చి వచ్చేటప్పటికి నాప్రా ణ్ప కన్నులోట్టోయింది. కొంపతీవ్వి వెంటాడలేదుగదా పుష్పం...పుష్పం...

పుష్పం—ఏమండీ! ఇంత ఆలస్యమైయిందేం?

శాస్త్రి—అవును. ఎన్నిగండాలుగడిచి పిండం బయటపడితే గాని ఇం చ్చేటప్పుడు జేరుకోగల్గింతో నీకేమి తెలుసు!

సీ॥ వేశ్యకొంపలజేరు ♦ విటుల కష్టంబులు
వేశ్యకు దెలియునే ♦ విప్పిజెప్ప
ముసుగులదలదాల్చి ♦ముందువెన్కలజూచి
స్నేహితాళికిజెప్పి ♦ చిత్రకథలు
దారివచ్చెడి మిత్రి ♦ తలనిడబాయించి
పనియున్నదనివేగ ♦ బరుగులెత్తి

లేని బాధలనుజూపి ♦ మానిమ్యాదీలను
దొంగ సాక్ష్యంబుల ♦ లొంగదీసి

సీ॥ ప్రభుల సానులకొంపకు ♦ వచ్చువిటుల
బాధ నెరుగంగ శక్యమే ♦ బ్రహ్మకైన
కాని కరుణ జనింపదే ♦ గణిక కయ్య
కాన్లు పడుచున్న జేటిలో ♦ గల్లుచునును,

సువర్ణానికిసువాసనగల్గినట్లు నీవు నిజంగా సంపన్నమైనదానవు. దానికి తగినట్లుగా తెలివైనదానవునూ. నీకు "లవ్" వెయ్యాడం తెలియునుగనుక, అతనిని భ్రమింపజేసి నాస్త్రితిగు కొండ ఇంతడబ్బు సంపాదించేవంటే మనం గర్వించనలసిందే

పుష్పం—ఏదోలెండి! మీారలా నన్ను పొగడాలని అంటున్నారు. మరేదీకాదు.

శాస్త్రి—నిజంగా నీవు సమర్థురాలవు. (నవ్వును) నీశక్తినాకు తెలుసు. ఇదిగో చూడుపుష్పం! నేనిచ్చటకు వస్తున్నాననన్న సంగతి శెట్టికి తెలియకూడదు. (ప్రేమతో) రహస్యంగానుండాలి! ఆ...ఆ...ఆ...ఆ. అల్లా చేశావంటే ప్రతిరోజూవచ్చే సం భావనంతా నీదే!

శెట్టి— (లోపలనుండి) పుష్పం! పుష్పం! (అని పిలుచును)

శాస్త్రి—అమ్మయ్యో! ఇంకేముంది! కొంపమునిగింది! నీతులు బోధించివచ్చాను. (భయముతో) ఏలాగు పుష్పం! ఇక నెత్తి మీాద ఈనాల్గువెంట్రుకలుకూడా ఉండనివ్వడు. వాణ్ణి పంపె య్యగలవా? లేక నన్నుదాస్తావా? త్వరగా!

పుష్పం— (కంగారుతో బల్లక్రిందదాచును) ఇక్కడుండండి! అది అల్లాపోయే ఘటంకాదు. పైచూపేగాని క్రిందచూపు తక్కువ.

శెట్టి— (ప్రవేశం)

పుష్పం—రండి! రండి శెట్టిగారూ! ఇలా దయచేయండి!

శెట్టి—ఏం పుష్పం? ఎవరితోనో మాట్లాడుతూన్నట్లు గొణుకుతున్నావే మిటో, (తనలో) కొంపతవ్వి శాస్త్రుల్లు ముండావాడు కాడుకదా! అమ్మ విడిడబాయింపు మాసిపోనూ! సరే ఉన్నాడో లేడో తేల్చుకుంటాను. (ప్రకాశముగా) పుష్పం! శాస్త్రి ఇక్కడ కలుసుకుంటానన్నాడు ఇంకా రాలేదూ!

పుష్పం—ఇంకా రాలేదు. వస్తాడేమో!

శెట్టి—అయితే ఎవరితో మాట్లాడుతున్నావ్?

పుష్పం—కొత్త సాంగు వల్లించుకొంటున్నా.

శెట్టి—ఏదీ! సాంగు-నువ్వే-పలుకోతూరి నువ్వే పాడాలి. నేనే వినాలి. అప్పుడేలా ఉంటుందో తెల్సా!

పుష్పం— (పాడును)

శెట్టి—సెబాస్! భళీ! ఏమి కంఠం? కోకిలగానం! హార్మోనియం కూడా అందటం లేదు. నేనో పదం పాడతా వింటావా?

పుష్పం—ఇకనేమి పాడండి వింటాను.

శెట్టి—(పాడును) అప్పునుగాని, శాస్త్రి ఈమధ్య కనుపించాడా నీకు?

పుష్పం—(తనలో) చూశాడా యేమి! (ప్రకాశముగా) లేదండీ! నా కెల్లా కనుపిస్తారూ! మా ఇంట్లో పెళ్ళిళ్ళా, ఏమన్నానా?

శెట్టి—పుష్పం! ఓ రహస్యం చెపుతాను. వాడెంత స్నేహితుడైనా మొన్నోపాలి మేజువాణీదగ్గర వెళితే వాడూ తయారయ్యాడు

పుష్పం—అప్పుడేమి జరిగింది?

శెట్టి—ఏమి జరుగుతుంది! మేల్సు-ఫిమేల్సు జరిగే ఇంట్రిడక్షన్ వర్క్ కద్దమని...

మూడవ రంగము.

రాఘు—కృష్ణారావు ధోరణి అంతకంతకు హెచ్చయి శృతిమించి రాగాన్ని పడుతోంది. పాపం! రాధ అమాయకురాలు, కృష్ణారావు తనభర్త అవ్వడనే మురిసిపోయింది. అహోరాత్రాలు ఆత్మనాధుణ్ణి ఆరాధించింది. నిద్రాహారాలు మరచింది. ఈ దౌర్భాగ్యున కొక్క త్రాగుడే కాదు! దానికితోడు వెనుకామలా వ్యభిచారంకూడా యుండీ యుండాలి. లేనిచో నాల్గురోజులలో ఎనిమిదివేల రూపాయలు అవసరమేముంటుంది? అతని వ్యభిచారమునకు తార్కాణ మీదుర్వ్యయముకాదా? దుర్జన సాంగత్యంవల్ల భాగ్యవంతులంతా దుర్బోధితులై, మేజర్లవ్వేటప్పటికి మదగజాల్లా తయారై, ధర్మాచరణ కార్యాదులపట్ల మైజర్లై, కర్ణకఠోరమైన, కార్యములపట్ల కర్ణుని మరపిస్తారు కూళలంతా. అమాయకురాలైన హైందవస్త్రీ, అన్యాయంగా, అసమంజసంగా, అసాధారణమైన అగౌరవాన్కి ఆహుతికాకుండా నేను సంరక్షకుడవడంచేత నొక చక్కని చింతజేసి, ఆస్తి అంతరించకుండగాను, కృష్ణారావుకి చిక్కకుండగాను చేయాలి. నేనిక పోయి నా విద్యుక్త ధర్మాన్ని నెరవేరుస్తాను. (పోవును.)

కృష్ణ—(ప్రవేశం) జీవితమన్న అందరికీ కాదు. నా జీవితమే జీవకళగల జీవితము. కాని నాసుఖములకు అడ్డు తగులుచున్న, రాఘన్న, రాఘవరావును; కడదేర్చినగాని, నాకీ భూమిమీద సుఖం లేదు. నేనెల్లా తిరిగితే వాళ్ళకెందుకు? వాళ్ళను సరిగా చూడనప్పుడుగదా! సరే! కొద్దిరోజులు కనిపెట్టిచూస్తా. (ఆలోచించి) కాని, రాఘవరావునుగూర్చి కొద్ది ఆలోచించవలసి

వస్తోంది, తం(డ్రికిన్నా ఎక్కువ వాడననడంచేత !

[రాధ; రాఘవరావు; వెంకటరమణ ప్రవేశం.]

ఏమిటండీ రాఘవరావుగారూ ! ఏదో ఘూట్లాడాలని వచ్చినట్లుంది ఈలా కూర్చోండి. రాఘవరావుగారు ? మీరు నన్ను గూర్చి అట్టె ఆవేదనపడకండి ! నామంచినాకు తెలియునంటూనా !

రాఘు—నాయనా ! స్త్రీ శ్రేయోభిలాషినిగాని, తదితరుడనుగాను.

కృష్ణ—ఇప్పుడెవరు కాదన్నారు ?

రాధ—ప్రాణేశ్వరా ! వారు మనకు పితృ సమానులు. వారేలా పిరి గినా మీసౌఖ్యములనే కోరెదము. మీరు నాకు దైవము. తాగుడు, వ్యభిచారము గౌరవదాయకములును, ఆరోగ్యప్రదములును కావు. నన్ను మన్నించి నామాటచెల్లించండి !

కృష్ణ—ఆరోగ్యదాయకము కాదని నాపట్ల సానుభూతి చూపించా లంటే, నీలో చాలా మార్పులు రావాలి. (తాగ ప్రారంభిం చును.)

రాధ—(సమీపించి) అమ్మయ్యో ! చాలింది. (సీసా లాగుకొనును)

కృష్ణ—ఏమ్ ! ఇలా తే !

రాధ—మీరు నన్ను చంపినను సరే, నేని విషముమాత్రం మీకీయను

కృష్ణ—ఇయ్యవ్ కామూ ! (కొట్టిలాగుకొనును.)

రాఘు—(అడ్డుకొని) తుచ్ఛుడా ఇంతవరకు వచ్చితివా ? చదువు న్నందుకు యిదా ప్రజ్ఞ. కరగిన మైనమువంటి మనస్సు, అప్పు డేవికసించిన పుష్పంవంటి శరీరంకల్గి, నిరంతరం నిన్ను ధ్యా నిస్తున్న ప్రేమస్వరూపిణిని కొట్టటానికి నీకు చేతులెల్లావ చ్చాయ్. నీచదువంతా ఈలా తగలేశావేం ? పోనీ, నీ అమా యక బాలకనిమూసైనా, ఈతని భావిజీవితాభ్యుదయాన్ని

కోర్నైనా, ఈ నీ పద్ధతులను, మార్చుకోనలేవా? మార్చుకోననా? ఇంతవరకెట్లో సైచితిని. జాగ్రత! (రాధను జేరి) అమ్మా! విచారింపకు. ఈ నీ బిడ్డతో సుఖించు. కృష్ణారావ్! నీతండ్రి చనిపోయినప్పటినుండి నీవ్యవహారముల చూస్తున్నాను. కనుక నేను తల్చుకుంటే నిన్ను ఫకీరుగాచేయగలను. అది జ్ఞాపకముంచుకొనుము. చిన్నప్పటినుండి నిన్ను పెంచి పెద్దవాణ్ణిచేయుటం వలన నీకపకారం చెయ్యలేనన్నమాట సత్యమైనా, రాధ పడేబాధ, ఆప్రేమను సళింపజేసింది. నాహృదయం పాషాణసన్నిభం. కనుక జాగ్రత్తగా ఆలోచించుకో, (పచారుచేసి) అయినా నిన్ను కొన్నిప్రశ్నలువేస్తాను. సమాధానంచెస్తావా?

కృష్ణ—కొన్నేమిటి? కావల్సి! మీయిష్టం!

రాఘవ—మానవుడు ప్రపంచమున సుఖజీవనము చెయ్యాలంటే ఏమి చెయ్యాలి?

కృష్ణ—తిరింకింగు-స్మోకింగు అని నాయూహ. ఇంకా పెద్దలు దగ్గర చెప్పకూడదు. కాని అయినా మీకు తెలియదుగనకనా?

రాఘవ—అమ్మా! పూర్తిగా తెగించాడు. ఆపానముండ ఎక్కడిదో నేర్చినది నాయనా నీకు? ధనమంతయు నీవిధముగ నైదునిమిషముల సుఖమునకై వెచ్చించువాడు ప్రపంచమున సుఖజీవనము చేయగలడా?

సీ॥ సంగీత సాహిత్య ♦ చాతు పంథలజూపి
విసుతింప లోకముల్ ♦ వేరుగనుచు
దానైక సీర్తులై ♦ దన్ని పేదలవారి
కష్టముల్ తొలగించి ♦ ఘనతగొనుచు
జనదల విధనల ♦ నహారహంబును బ్రోచి
ధన్యవాదంబుల ♦ మాన్యులగుచు

లోకైక శాంతికై ♦ వీక యత్నముజేసి.
విశ్వమానవదృష్టి ♦ వినుతిబొందు
యువకులే స్వచ్ఛ కలజాలే ♦ యున్నతోన్న
తాచ్ఛ భావాల వెలుగొందు ♦ ధైర్యవంతు
లే సురాపాన వారనా ♦ రీ దవాగ్ని
మాడుచుండిరి రక్షించు ♦ మార్గమేదో ?

కృష్ణ—ఇంతేనా చెప్పవలసింది ?

రఘు—పెద్దవాడను గనుక అనుభవముమీద చెప్పా ! [illegible]
[illegible]ష్టం. (అని వెళ్ళును.)

కృష్ణ—థాంక్స్-గుడ్ బై ...

తెర వాలును.

---

## నాల్గవ రంగము.

(శెట్టి, శాస్త్రి, కృష్ణారావు, నాటకపుసీను.)

శాస్త్రి—ఏమోయ్ ! శెట్టిగారూ ! ఊళ్ళోసంగతు లేమిటి ?

—ఆ ! మీకు తెలియని విషయా లేమిటి ?

శాస్త్రి—మబ్బువేట కేమన్నా బయలుదేర లేదుకదా !

— మబ్బువేట లేదు ! మీ మైంతువేటా లేదు ! శాస్త్రులుగారూ ! తమ రేమనుకుంటున్నారోగాని, ఆపనుల్లో మనకు [illegible] లేదు. కాసీకి కొఱగాని కోమటివల్ల ఏమవుతుందయ్యా ?

శాస్త్రి—అవును. కానికికొఱగావు, కాసుచేగాని. సరేగాని మొన్న పుష్పంయింట్లో నీమాట వినిపించిందే ? నేను ప్రక్క పుగుణ[illegible] త్తంగారింట్లో ఆబ్దీకం పెట్టిస్తున్నానులే !

శెట్టి—ఏమయ్యోయ్! నీవేమైనా కొత్తా ఓపెన్ చేశావేమిటయ్యా? అంత కష్టంగా అడుగుతున్నావ్? పంతులూ! నీదన్నట్టుగానే మాట్లాడుతున్నావ్! కృష్ణారావు సంగతి తెలియదుగావును నీకు, ఈ సంగతి తెలిస్తే ఎప్పుడో జలతరంగిణీమోత మోగించేస్తాడు! సందేహం లేదు. మామిడిసిపడుతున్నావ్? పుష్పం మూలంగా నీవు, నీభార్యను కష్టాలు పెడుతున్నావని ఇరుగుపొరుగువారు చూడలేక పోతున్నారని ఊరంతా గోలగా ఉంది.

శాస్త్రి—ఏమిటి వాగుతున్నావ్?

శెట్టి—ఏమీ లేదు. నార్నింగు బెల్ వాయిస్తున్నా?

శాస్త్రి—(ఒకవైపుకు చూచి) వచ్చేది కృష్ణారావేమిటి? భక్తుడిపోర్షన్ కంఠస్థంగా వచ్చిందా శెట్టీ?

శెట్టి—ఆ! కంఠస్థంచేశాను. కాని కంతంపోయింది. మరి నీ మహంతు పోర్షన్ వచ్చిందా?

శాస్త్రి— ఆ! రెడీ!

కృష్ణ—(తూలుచు ప్రవేశం) ఏయ్! రిహార్సెల్సు పెట్టండిరా? యోగి గారువచ్చారు.

శాస్త్రి—మాటలోనేవచ్చారు మహానుభావులు! మీకు [illegible] అనుకూలంగావుందా? పోర్షన్ అంటూ [illegible]

శెట్టి—(అపవారించి) శాస్తుల్లూ! ఆబాబుగారి [illegible] నాడు ల్లేపేస్తాను, (కృష్ణారావు నమస్కరించి [illegible])

యోగి—(మహంతుతో) ప్రాంటర్ లేచిపోయాడు. [illegible] సరిగా రాదు ఎలాగ?

మహం—నాకూరాదు. సమయానుకూలంగా, సమంజసంగా, [illegible]గా, సామరస్యంతో, సందర్భమైన సారస్వతంతో సా[illegible]

ANDHRA [illegible] Call No....... Acc No....... Date.......

సామాన్య మనుజులంతా మదలి సర్దుకొనేలాగు, మన ప్రజనేతలంతా హాయ్! హాయ్! వన్సుమోర్ అనేలాగు చేసి, చల్లగా సమర్థించుకొని సద్దుకొందాం. (శెట్టిగారితో) భక్తశిఖామణీ! నీవు గాని, పోర్షన్ వచ్చియుంచ లేవుగదా!

భక్త—అయ్యలారా! నాకసలే పోర్షన్ వచ్చియుండ లేదేమో! ఎవరికి తోచినట్లు వారు, తమ తమ పాత్రల సమర్థించి పరువు నిలుపుకోవాలి! తమరుముందుమా ప్రేక్షకులు పసిగడతారు.

యోగి—భక్తాగ్రేసరా! నీభక్తికి మెచ్చితిని. నాశతననే యీలోక ప్రపంచము సృష్టింపబడినది. నావల్లనే తిరిగి దాని లావణ్యమా లయమౌతుంది. గంగా శిఖాగ్రౌన్నత్యమును మరపించు నా యోగాభ్యాసము ఎన్నోలోకవృక్షముల సృష్టించజేసిన మహాత్మా-ర్యమువలన ప్రకటితమవదే?

భక్త—మహాశయా! మీవంటిమహానుభావులు; మావంటి మానవులపై కరుణచే నట్టికార్యములు చేసియుండకుండిన, మీసేవచేయు మాకేమిలాభముండును?

మహా—సరియే! కాలాతీతమగుచున్నది. నీ యభీష్టం యేమ్యదియో కోరుకొనుము.

యోగి—నీ మహత్తరమైన మంత్రప్రభావమున, లోకములు తిరుగుచున్నట్లు నాకగపడుచున్నది.

భక్త—స్వామీ! యోగిపుంగవా! అట్టియున మిమ్ముల స్తుతింపకుండుట లోపమే. మిమ్మెట్లు స్తుతింతును? దండకం మామూలు కాని అది నాపను జ్ఞప్తికివచ్చుటలేదు. ఏరాగము తమ ప్రీతి?

యోగి—స్త్రీరాగం, పుష్పరాగం అంటే నాకనురాగం.

మహా—భక్తాగ్రేసరా! ఇక నేమి? పలికించినచాలది అనస్వాగతములు

హెచ్చవనున్నవి. యోగిపుంగవునకు అనురాగమైన పుష్పపు రాగమును గ్రోలినంత సౌరభంతో సుమమును, సందేహం లేకుండా స్వార్థత్యాగం జేయసమకట్టారు. అంతటితో తనివి జెంది పుష్పాన్ని పరమప్రీతితో పుచ్చుకో.

శెట్టి—(బిగ్గరగా) ఈ మాట్లాడబోవు విషయము స్వగతము-ఆత్మీయము- కాన ప్రేక్షకులు, మావిషయమున జోక్యము కలుగజేసికొనరాదు. కంట్రాక్టరుగారూ! కంగారు పడకండి! కంట్రాక్టు సొమ్ముకాస్త యిచ్చేస్తాను. అడ్డురాకండి! ప్రేక్షకులారా! మరల హెచ్చరిక. మాయీ యాలస్యమునకు మీకొప్పకుందు లేని, కంట్రాక్టరునుండి రిఫండు గైకొనుడు. శాస్త్రీ! నిన్నిప్పుడేంచేసినా పాపంలేదు. పదిమందిలోను, నావంటి జంటిల్ మెన్ అనగా ఈరాంశెట్టిని డైరెక్టుగా ఇన్సల్టు చేస్తావా? నీమీద ఇప్పుడే పరువునష్టం దావా వెయ్యడాన్కి ప్లీడర్ను కలుసుకుంటాపోయి. (పోబోవును)

కంట్రాక్ట—సంయ్! ఏమిటి గలటా? రాస్కేల్సు, ఫుట్ స్కేల్సు, మీటర్ స్కేల్సు.

శాస్త్రి—(శెట్టిని బ్రతిమాలుచు) శెట్టీ! తప్పు క్షమించు సరదాగా అన్నా, ఇప్పుడుగనక, అతనికి తెలిస్తే అంతా అల్లరే! వీపులు చెడతాయ్. నిషాతగ్గితే అంతాగ్రహిస్తాడు. కొంపతవ్వేస్తాడు

శెట్టి—ఆ! కపడదార్! ఎవరు? అ! వస్తున్నా! మా అయ్యా పిలుస్తున్నాను. అయ్యా!......

(తెర పడును.)

రాధ—హా! దైవమా! ఎంతలో నెంత పరిణామము దెచ్చితివి! అమృత తుల్యమగు ప్రేమ నెంతలో విషముగా మార్చితివి! నాపై ప్రేమ లేకున్నమానె, యీనడత లేమి? అతివిచక్షణ సురాపానమా? భయంకరమగు వ్యభిచారమా? వీనిచూడ కంటికి కనుపించుటయే కష్టముగానున్నది. ఏమిచేయుదును? ఇక నాకు దిక్కెవరు? ఎవరనుట కేమున్నది శివ శివ!

పతియే దైవము సతికి
పతియే పరసాధనంబు ♦ భామలకెల్లన్
పతి కంటె లేదు వేరుగ
గతి సాధ్వీమణికి పతియే ♦ గతియటలెంచన్

కృష్ణ—(తూలుచు) హా! హా, హా, హా! వెరీగుడ్, ఎక్సలెంట్-వన్సుమోర్ భేష్! ఆపాటకుతగినట్లు డ్యాన్సు కూడాచేస్తే, దేవలోకపుస్త్రీ, ఆరంభదిగివచ్చినట్లుంటుంది. కమాన్! రా! పాడు! రెండు బీర్ బాటిల్సు పుచ్చుకుంటే ఎంతహుషారు కలుగుతుందో అంతకన్నా ఎక్కువమజాగావుండాలి! సిగ్గుపడతావేం? తమాషాగా ఆడాలి! పాడాలి! సిగ్గుపోవాలంటే, చుక్కపడాలి! (నోటబోయ బోవును)

రాధ—ఆ... ఆ... మీకిదితగునా? అయ్యో! (వదలించుకొనును)

కృష్ణ—కంషియర్! పరవాలేదు! త్రాగవచ్చు ఈ తల్లి యండ బట్టే ఇంత హుషారుగా ఉంటున్నాను నేను! నీవుకూడాకాస్త పుచ్చుకున్నావా! ఆడేస్తావు! పాడేస్తావు! బలేడాన్సు చేస్తావు! (మరల నోటపోయ బోవును)

రాధ—నాథా! ఆగుము! మీకీది ధర్మముకాదు. త్రాగుటకు, నాడు టకు, పాపినిగాను! సంసారిని! క్షమించవేడెదను! ఆహా! ఏమిచేయుదును! వీరికి మతి యున్నట్లు తోచదు. ఏమిదీనిప్రభా వము! నాథా! సంసారకిదితగునా?

కృష్ణ—సంసారంటే సమూచేశానికివచ్చినమాట. దేవతలకు డ్యా న్సంటే చాలాయిష్టం. నాట్యకత్తెలంటే దేవకన్యలన్నమాట. నీవు నాట్యం చేశానంటే, దేవతాస్త్రీవవుతావు. దేవత హాజ్ రెండ్ దేవుడు. అంటే త్రాగే జ్ఞాని అనగా నాబోటి బుద్ధిశాలి. కాన నేనుదేవుడను. (నవ్వును) దేవుని భార్యవునీవు! నీమగ డు వీడు. ఇంతకు కారణం? ఈబాటిల్. మనుష్యులను దేవత లంతవారిగ మార్చేస్తుంది. దీనిశక్తిచూచు! (త్రాగి) ఏమిదీని మజా! ఇది నిజముగా నమృతమే. లేకుంటే, దీనికింత శక్తియె క్కడిది? నాబోటి జ్ఞానులేకాని, దీన్నికనుక్కోలేరు. అట్లా కనుగొనగలిగినవాడే స్వచ్ఛమైనజ్ఞాని, వానికే దేవునిదర్శనం ఛీఛీ! ఏయ్! మొద్దూ ఆలాగే నిలబడ్డావ్. రా! కొంచెంపు చ్చుకో, (బలవంతపెట్టును)

రాధ—ప్రియా! నన్నేల బలవంతపెట్టెదరు. నేను మీబానిసినిగాను? క్షమించరు?

కృష్ణ—వాట్! క్షమ! క్షమించడమేమిటి? ఆమాట మన డిక్షనరీ లోనే లేదు. (కొట్టును)

రాధ—నాథా! మీకిదిన్యాయమా! నాథా! నాథా!

రాఘు—(ప్రవేశించి) కృష్ణారావ్!(దీర్ఘముగచూచును)

కృష్ణ—ఆహా! వ్యాసమహర్షి వనిసించుచున్నావ్! తల్చుకోవడం తరువాయి-తయార్! రాధకేమైనా అభయహస్తం యిచ్చావేమి టి? తల్చుకొనగానే తయారౌతావని!

రాఘు—వేయ్! కృష్ణరావ్! ఇంతవరకు వచ్చితివా?

(తేరిబారిచూచును.)

కృష్ణ—యస్. సమయానికి వచ్చారా? ఈవిప్లవంలో మీరుకూడా పాల్గొని నాచే బహుమానాలు పొందండి! అలాచూస్తారేం?. రండి! డ్యాన్సు చేయించమంటారా! (భార్యను లేవదీయ సమీపించును.)

రాఘు—(అడ్డుదగిలి) కృష్ణారావ్! దూరంగాఉండు. నీచేష్టలంతకంతకు మితిమీరుచున్నవి.

కృష్ణ—యు. ఆర్. మై బ్రదర్! గుక్కెడు పుచ్చుకోండి! పైత్య శాంతి చేస్తుంది.

రాఘు—కృష్ణారావ్! జాగ్రత! నీవేమనుకుంటున్నావో?

కృష్ణ—మీ బెదరింపులకు బెదరుట కిదివరకు కృష్ణారావుకాడు. సురాపాన సేవజేసి సురాభాండేశరుడయ్యాడు. ఏమనుకున్నారో?

(సమీపించును.)

రాఘు—దూరము! దూరముగనుండుము.

కృష్ణ—దూరం-దూరం. అంటున్నారు! ఏం? త్రిడేస్, ప్రివిలేజి, కాదుగదా?

రాఘు—మూర్ఖుడా! కన్నుమిన్నుకానకుండా ప్రేలుతున్నావా?

కృష్ణ—ఓహో! మీరు పుల్లింగానికి చెందుతారుకదూ?

రాఘు—త్రాగుబోతా! ఇంతవరకు వచ్చిందా నీదుష్ప్రాండిత్యం?

కృష్ణ—దబాయింపులకు బెదరడాన్కి- మానవుడై తేగా? మరి దేవుడు.

(పోవును.)

తెర వ డు ను.

---



# పుష్పరాజ్యం లేక రాధాకృష్ణ.

## తృతీయాంకము.

### మొదటిరంగము.

—(పాడుచు ప్రవేశం) ఆహా! మొన్నటి దృశ్యమెంతగ వేధించుచున్నది. తలపునకువచ్చి ఒడలు గగుర్పాటుజెందుచున్నది. ఉత్కృష్టమైన మానవజాతిలో జన్మించి, ముకుందునిమరచి, సురాపాన వ్యభిచారములనెడి దుర్వ్యసనములకులోనై, యహంకారమునువీడక, నెందఱి పతివ్రతల హింసించుచు, నెంత యనమానమునకు పాలుచేయుచున్నారు? కృష్ణా! భక్తవత్సలా! నీభక్తుల జ్ఞానముచే తప్పుద్రోవల బడునప్పుడు పతివ్రతల ఘోష ఎక్కువగానున్నప్పుడుకూడ, యిట్లుపేక్షించెద వేల? కోమలాత్మి కోమలమైన కరుణచే నెందఱ బ్రోవలేదు? ఎందరు పతివ్రతా శిరోమణులు నీచే రక్షింపబడలేదు?

పాలించినావట ♦ పాండవపత్నిని
కోట్ల్వాన చీరలు ♦ గోరసీవు
పాహిమాం శ్రీహరీ ♦ పాలింపవేయన్న
కరిఁబ్రోచినావట ♦ కరుణ గలిగి

స్త్రీనామ మంత్రమే ♦ చిద్విలాసమటంచు
పఠియించువారలు ♦ ప్రబలిరవని
పతిసేవ యాభువి ♦ బరమార్థమనియెంచు
వెంగలులెందరో ♦ వెలసినారు
పురుషుడా! సర్వశక్తిని ♦ బోవనాడి
యతివకును దాసుడైతివా ♦ హరినిగనవ
ముక్తిమార్గము వెదకవో ♦ పురుషవర్య!
స్త్రీలు మోక్షంబునివ్వరు ♦ శ్రీశుడిచ్చు.

నాయనా! అట్టి పాపకార్యములకు లోనవకు.

శెట్టి—మహాత్మా! గుట్టంతా చెప్పినతర్వాత మీరిట్లాంటే, ఇంకనా పని జరిగేదెట్లా! ఏమంత్రమైనా నుపదేశించక పోయినట్లయితే నీరులేని గోతిలో పడికిచస్తా.

యోగి—చెప్పెదను యిటురమ్ము నాయనా! (చెవులోచెప్పును.)

శెట్టి—దీనివిధానమెట్లో వివరించి సెలవియ్యాలి!

యోగి—ఔను. మఱచితిని. ఈ మంత్రమును బిగ్గఱగా పఠించుచు నామెదగ్గఱకుబొమ్ము. ఆమెకు ప్రేమస్థైర్యమునొందు సమయమున నీతో మోటసరసములాడును. నీవదంతయు ప్రేమలాగు భావింపవలెను. అప్పుడామె ప్రేమ నిశ్చలమై స్థిరమగును. ఆ ప్రేమను మరలించుటకు మన్మథునకైనను సాధ్యముకాదు,

శెట్టి—సెబాస్! ఇక వీళ్ళిద్దరు ఎక్కడకుపోతారో చూద్దాం! యోగిగారూ! సెలవు. తీరా నర్సు మర్చిపోయాను. మళ్లా కనిపిస్తారుగా! (వెళ్ళును.)

యోగి—ఇతనికి ప్రాయశ్చిత్తముకాగలదు. (పాడుచు బోవును.)

(తెర పడును.)

## రెండవ రంగము

(కృష్ణారావు గృహము--కృష్ణ, రాఘవ. రాధలు కూర్చుందురు)

కృష్ణ—రాఘవరావుగారు! ఆస్తి అంతా అమ్మివేయాలి తెలిసిందా?

రాఘ—నీ దోషము పశమించుగాక! ఏమి నాయనా! నీకంత డబ్బెందుకు కావలసివచ్చినది?

కృష్ణ—అనంతయు మీకనవసరం, అప్రస్తుతం. అయినా చెపుతాను వినండి, స్వర్గానికంటె ఎక్కువ సౌఖ్యాన్నిచ్చే పుష్పానికిన్నీ, సురాపానమునకును ఖర్చుపెట్టాను. అంతాఖర్చుపెట్టదల్చుకున్నాను! తప్పా?

రాఘ—తప్పేమీలేదు! కాని ఈ నీ భార్యా బిడ్డలనెల్లా పోషిస్తావ్?

కృష్ణ—ఎల్లాగా? ఆపుష్పానికి సేవజేసి! అట్టి మహా సాధ్వికి నాబోటి జ్ఞానీ, మీబోట్లు సేవజేసినఅనేక జన్మల్లో చేసిన పాపములన్నీ పోయి పుణ్యాం సంపాదిస్తాం, ఇక మీరైనా ఎంత కాలం బ్రతుకుతారు? ఇప్పటికైనా బుద్ధితెచ్చుకొని నాతో మీరుకూడా నామెకు దాసోహమొనరిస్తే బాగుంటుంది! ఈ విషయం చెప్పటను నేను గర్విస్తున్నాను,

రాఘ—అల్లే నాయనా! నీబోటి జ్ఞాని బోధించిన వినక చెడుదుమా? ఓ నవనాగరిక యువకపిశాచమా! నీప్రజ్ఞకాల! మిక్కిలిగర్వంతో సంచరిస్తున్నావ్! భయంకర నారీపిశాచము మద్యపిశాచము నిన్నావృతమై కడుపుకడుపులు బాదలునట్లు జేయుచున్నను గానలేక కండ్లు కానరము గమ్మి కడుకడ గండ్ల బ్రాలగుచున్నావు! నాయనా! ఈ నీ రాధను చూడుము! దేవలోకము నుండి దిగివచ్చిన దివ్యకన్యగాని మరి యొండుగాదు. ఇంతటి

సౌందర్యరాశిని, కోమలాంగిని ఇట్లు బాధించవచ్చునా? ఆపె లట నీకంత యందకత్తెగా దోచెనా?

కృష్ణ—ఆమె పలటయా? ద్రోహి! మహా పాపం! కళ్ళుపోతాయి! చిన్నవాడనో పెద్దవాడనో చెపుతున్నా! లెంపలు వేసుకోండి తెలిస్తే పాతేస్తుంది. మీరెప్పుడైనా పుష్పాన్ని చూచారా? ఆమెయందమును ఈ డబ్బా అందమును వర్ణిస్తా వినండి

పూర్ణ చంద్రుబోలు ♦ పుష్పంబు ముఖమును
అట్లు పెనముబోలు ♦ నతివ మొగము
సింహ మధ్యముబోలు ♦ చిన్నారి మధ్యంబు
దరు మూలమునుబోలు ♦ వన్నెవలపు
హంసను మఱపించు ♦ నతివ చక్కనినడక
కొంగను మఱపించు ♦ కూళనడక
మెరుపుతీగెను మించు ♦ తరుణి దేహపు కాంతి
మసిపాత మించునీ ♦ మగువరూపు
అహాహా! మురియంగవలె నీమె ♦ యందమునకు
ఒరులు గాంచిన డోకరే ♦ ఒక్కరనుచు
పగలెజూచిన భయమగు ♦ పాపిదీని
ముఖము జూచియు మురిసేవు ♦ మునలివగుట!

రంఘు—మోహా మెంత గ్రుడ్డిది? పోయినదంతయు బోయినది. ఇకమీద నను జాగ్రత్తతో మెలగు నాయనా! ఇట్లెందరు చెడిరో తెలి యదా నీకు?

కృష్ణ—తెలియును గనుకనే మంచిదని చెప్పుట. ఇకనాస్తి పోయినను ఆమెను జూచుకొనుచు పర లోకమున యొక భవనము నిర్మిం చు కొంటాము.

రంగ—(తనలో) ఈతుచ్ఛునితో మాట్లాడుటయే తప్పు! మీరాహిశా

చ మోసగించిన వానికెవ్వరు సహాయభావము చూపగలరు ?

(నిష్క్రమించును)

రాధ—నాథా! నామొఱ వినరా? త్రాగుడు, ఆమె స్నేహము మానరా? నాతలిదండ్రు లెంత యస్వస్థులుగా నున్నను, మిమ్ము లను వదలి వెళ్ళలేకున్నాను! ఎందుచేత? మీకు తెలియనిదా! భారతవనితకు పతి సేవయే ప్రథమ ధర్మము! కాబట్టి మీరెన్ని కష్టాలు పెట్టినా నేను మిమ్మల్ని విడవలేను. మీరు నా మాట విని వేశ్యాలోలత్వాన్ని మధుపానాభి పానాన్ని వదలండి!

కృష్ణ—నీమాటలువిని నేనిదివరకే భ్రష్టుడయ్యాను. ఇప్పుడుచూడు-- ఎంతఖుషీగా ఉంటున్నానో! కోడలు! భార్య-రెండుజంతువు లు! ఎందుకు? ఇట్టి సౌఖ్యములకడ్డుదగిలి నాప్రణయనావను ముంచివేయుటకుగాని, నాసుఖములజూచి నీవు సహించలేకుండాయున్నావు. అవునా? నాకు సౌఖ్యముగ నున్నదని సంతో షించి చెప్పుచుండ నీవు విచారించుచు కూర్చున్న అర్థమేమి. పైగా నన్ను ప్రేమిస్తున్నానంటున్నావా? మొంకీరాస్కెల్. త్రాగడంలో ఉండే ఆనందాన్ని నేర్పి జ్ఞాననేత్రాన్ని వికసింపజే సినదెవరు? పుష్పం--నీవు నాతోనచ్చి నేను చూస్తుండగా, ఆమె పాదములపైపడితే అది ఎంతగానంతోషిస్తుంది. వసువా! ఇక మాట్లాడనెంచితివా? ఇదిగో!... (కొరడానుచూపును)

రాధ—ప్రాణేశ్వరా! మీకిదిన్యాయమా? అగ్నిసాక్షిగా వైవాహిక మాడిన భార్యను దుఃఖపెట్టవచ్చునా? నేనుమొక్క దాసోహం మొసర్చిన మీకపకీర్తికాదా?

కృష్ణ—అగ్నిసాక్షిగ వివాహమాడితినా? అవును! (సిగరెట్ వెలి గించిచూపును) ఆయగ్నిసాక్షిగానే చెప్పుచున్నాను. ఇకనీకూ

నాకా సంబంధ మెన్నఁడా లేదని నీవుకూడా ప్రమాణంచెయ్!

రాధ—నాథా! నాసర్వస్వము మీరే! నాపై మీకు ప్రేమలేకున్నను మిమ్ములను ప్రేమింపకయుండజాలను. మీభార్యయు నిసించుకొనుట వలనవచ్చు సౌఖ్యములకంటె నితరము నేనపేక్షింపను. ఆసౌఖ్యమే లేనిచో నాకేదిదారి?

కృష్ణ—గోదారి! పాపినీ! నీవు యౌవనము నశించుటచేనట్లువైరాగ్యమున మాట్లాడుచుంటివి. నీకే సుఖమనవసరమైన నాకవసరం. పాపాత్మురాలా! నాయెదుట నుండుటకు కూడాతగవు. (గెంటివెళ్ళబోవ)

రాధ—(పాదములపైబడి) ప్రాణేశ్వరా! నన్ను రక్షింపరా! అయ్యో! నేనేమిచేయుదును. మరల పోవుచున్నారే? (వెంటబడి వీధిగుమ్మమున పడియుండి పాడును.)

మిమ్మునమ్మిచు జీవించు ♦ మీన నయన
నిటుల నిందింపధర్మమే ♦ యెటుల మిమ్ము
వీడిజీవింతు నొకసారి ♦ విచ్చి కనుల
జూడకద్దియు నేను నో ♦ చుకొనలేదె?

యోగి—(పాడుచు ప్రవేశం) ఎవరీమె? ముఖముజూడ నుత్తమస్త్రీలక్షణములు గన్పట్టుచున్నవి. మూర్ఛిల్లినట్లున్నది. (సేదదీర్చి) తల్లీ ఏమిది? నీవిట్లు పడియుండుటకు గలకారణమేద్ది?

రాధ—(నెమ్మదిగాలేచి) నమస్కారములు తండ్రీ! ఎవరుమీరు? నన్నుద్ధరించుటకైవచ్చిన మహాత్మునివలె గన్పట్టుచున్నారు! దయచేయుడు!

యోగి— అమ్మా! నీపేరేమి?

రాధ— రాధ. యందురు స్వామీ!

సౌదా.—ఎంతచక్కగా విసేరు ? తల్లీ ! నీవంత విచారముగ నుండుటకు హేతువేమి ? ఎరిగినదైన చెప్పుముతల్లీ !

నాగ—ఏమని చెప్పుదును తండ్రీ ! ఇది నా గ్రహచారము. పూర్వజన్మకృతఫలం !

సౌదా—(గ్రహించి) ఇదియా కారణము ! ఈ భారతభూమిని నీవలె పతి తిరస్కృత లనేకులుగలరు. ధైర్యము విడువకుముతల్లీ ! ఎప్పటికైనను సుదినములు రాగలవు.

నాగ—ప్రభూ ! అట్టి యదృష్టము నాకు లేదు. ఈదౌర్భాగ్యస్థితిలో పతి వియోగమున ఎంతకాలము జీవింపగలను తండ్రీ !

పతి ఋణు జేసుట గనుగాని
సతి పతి దరియంగబోయు ♦ చయ్యన వానికి
హిత వచనంబుల నొడ్డగాని
పతి హిత మొనరించునదియె ♦భార్యయ ధరపై.

సౌదా—వెఱ్ఱితల్లీ ! పతివ్రతకు భర్తృ వియోగమే లేదు. సర్వకాల సర్వావస్థలయందు పతివ్రతా హృదయమున భర్త జీవించి వశించుచుండును. ఆ లోకమున వియోగముకాని, కలహము కాని, కోపముకాని ప్రవేశింపజాలవు. కాని తల్లీ ! ఈ బాహ్య ప్రపంచదృష్టితో ప్రేమ నర్థము జేసికొని భగ్నహృదయులై వశించిపోవుదురు. నీవా మార్గమును మాత్రము పట్టకుముతల్లీ ! పతి కొట్టినను, తిట్టినను, పరుషవాక్కులనాడినను సతి శాంతముగ దరహాస వదనయై సమాధాన మొసంగుటయే వలసినధర్మము. నీవుమాత్రము సామాన్యవా ? నీకు బోధించవలసిన నూతన విషయములుగాని, మంత్ర తంత్రములుగాని, లేవని యు, నాకు తెలియు. నీ పాతివ్రత్యమహిమయే నీకుముమ్మందను

సర్వసౌఖ్యముల నిచ్చునని నాదృఢ విశ్వాసము. పాతివ్రత్య మహిమచే నెందరు పడతులెంతటి మహత్తర కార్యములను సాధించలేదు?

మూర్తిత్రయంబును ♦ ముద్దుపాపలఁజేయు
సతి యనసూయ కే ♦ శక్తిగలదు?
పెనకరుగద్దించి ♦ తనవాంఛ నెఱవేర్చు
సాధ్వి సుమతికి నే ♦ శక్తికలదు?
తలపూవు వాడక ♦ దాసగ్నిని నిల్చు
ద్రౌపదీదేవి పుత్రి కే ♦ శక్తిగలదు?
యముమువెంట దివికేగి ♦ యాచించి పతిబొందు
సావిత్రి సాధ్వి కే ♦ శక్తిగలదు?
అట్టిశక్తిలభించు ప ♦ త్యబ్జపాద
సేవనముజేయు పడతుల ♦ శీలతతిని
దానినెప్పుడు మరువక ♦ తన్వినీవు
పతిని సేవించి శక్తిని ♦వడయు మమ్మ.

(పాటపాడుచు నిష్క్రమించును.)

తెర బడును.

---

మూడవరంగము.

శెట్టి—(శెట్టిగృహం) ఏయ్! ఓయ్! సీతామాలక్ష్మీ! నా నాయాలుగా నా భాగ్యరాశి! నా జీవితఫలమా! నా ప్రేయసీమణీ! రా—

సీ— —ఎందుకేటి? అంతగా వర్రి స్తున్నారు?

శెట్టి—అవును. పన్నెత్తు. అబ్బాయిని ముద్దుగాని పెట్టుకొంటే గంట్లు కొట్టిన తేనెగటిపోయిలా, తయారవుతుంది దవడ. కాని ఆలా గుంటేనే బాగుంటుందేమో ? ఎందుకంటావా ? కాలర్సువత్తి పెట్టుకొని ఏడా-పెడా చూస్తూ పోతారుచూడు, సన్యాసిముండాకొడుకులు, ఆలాంటివాళ్లకి ఎట్రాక్టివ్‌గా నుండక, స్త్రీవాంఛ అన్నవాంఛపోయి, బుద్ధిగల్గి ప్రవర్తిస్తారు. సరేకాని, మీాయన్న ఏమాత్రం కట్నం యిస్తాడు?

సీత—ఏ నాలుగు వేలో లాంఛనాలతోసహా ఇస్తాడు. చాలదంటారా?

శెట్టి—ఏం సరిపోతుంది ? కుర్రాడికి కట్నంతో లోగిలివిప్పించి, మేడ కట్టిద్దామనివుంది. మరింతకు దైవానుగ్రహం ఏలాగుందో ?

సీత—అంత మాయన్న యియ్యలేడసుమండీ ! అయినా వాళ్లపిల్లనే చేసుకోవాలని ఉంది.

శెట్టి—నీకంటే అలాయిప్పించు. లేకపోతే మాచెల్లెలిగారమ్మాయినే చేసుకొందాం. వాళ్ళుకట్నం, కానుకలు, బాగా జరుపుతారు. రేపే వెళ్లి సెటిల్‌చేసుకొని వస్తాను.

సీత—నేనూ రేపేవెళ్ళి మా అన్నయ్యగారమ్మాయిని స్థిరపరచుకొని వస్తాను.

శెట్టి—ఏమి టేవ్ ! పొగరుబోతులా మాట్లాడుతున్నావ్ ! నీకు నన్నుందో-పోయిందో జ్ఞాపకానికి తెచ్చుకో

సీత—ఇదివరకోసారి పెళ్ళయింది. జ్ఞాపకానికి తెచ్చుకోండి ! పొగరు బోతు తనమేమిటి ? కన్నతల్లిని కాబట్టినా యిష్టం !

శెట్టి—నీయిష్టం నిలువునా పాతేస్తా ! టేకేర్ మై డియర్ వైఫ్ ! ఇది వరకు మల్లేకాదు. ఆభయాలన్నీపోయాయ్, ఇప్పుడు ఏమ్ !

వీరవరుడను శూరుడ ♦ ధీరవరుడ
కొమ్మలొచ్చిన సంగీత ♦ కోవిదుండ
మెడలుపొందిన యాక్టర్ని ♦ పుడమినన్ను
బోలగలకెవ్వరు మెంతయు ♦ బుద్ధిలేదె?
కన్నులు నెత్తికివచ్చెనే కాంచలేవె!

సీత—పాతివెయ్యడమంటే తేలికగావుందికామా! (చెవిపట్టుకొని) ఏది? పాతిపెట్టండి, భర్తగారి శపథమునకు సంసిద్ధురాలనైయున్నాను.

శెట్టి—ఆ, ఆ, అంతపనే! ఎవరైనాచూస్తే సంబంధాలురావు, విడిచిపెట్టు. (వదలించుకొని) సన్యాసి నోరుముయ్!

సీత—ముయ్యాలి! (అని వెళ్లును)

శెట్టి—ఏలాగైనా మనమంటే ఎఫైర్డే! కానివాళ్ళు వాళ్ళను వెంటతీసుకొనివచ్చి; సెకండువారు ఫ్రంటు ఓపెన్ చేస్తుందేమోనని భయం. లేకపోతేనా...... (వెళ్ళును.)

తెర బడును.

---

## నాల్గవరంగము.

ఘనస్వం—(తనగదిలోకూర్చుండి పాడుకొనుచు) అదృష్టమన సిట్లుండవలె, శెట్టిని, శాస్త్రిని, చాలవరకు మాయబుచ్చి, ధనమును సంగ్రహించితిని. ఇక కృష్ణారావుకూడ చాలలొంగుబాటులోనికి వచ్చినాడు. ఆ రాధమీదకసి, నితగానినాధారము జేసికొనితీర్చుకొనవలెను. అట్లుచేసినగాని, మనస్సిమితముండదు. కొంతకా

లము కృష్ణారావు నింటికికూడా వెళ్ళకుండాచేశాను, ఆముం డతప్పక లొంగితీరుతుంది. లోకన్న దానికింత కనుపుమంట యేల ? నాథుడంటే అర్థమేమిటి ? ఆమె మసిపాతలాగుంటటం వలన అనాథయ్యింది, అనాథుడే యిప్పుడు నానాథునయ్యాను మరి యితరదేశములలో యిల్లాగా ? పాశ్చాత్యదరసప్పుడు భార్యాభర్తలు విడాకులు పుచ్చుకొంటారు. ఇచ్చవచ్చినట్లు విచ్చలవిడిగా సంచరిస్తారు అదిసుఖంగాని చేసుకున్న హాకెభర్త. అతకెట్టివాడైనా వానితోనే ఆజన్మంవరి. అని యంటున్నాను వాళ్ళందరికీ, ఏ మంత్రప్రయోగమోచేస్తే బాగుంటుంను. సంగీతానికిచింతకాయలు రాల్తాయా ? అయినా యిప్పటి మంత్రాలుపట్టిచ్చి చస్తాయా ? (ఆలోచించి) వేరుమార్గము లేదు. కృష్ణారావుచే రాధ రాఘవరావులకడ తేర్పించినగానినామనోభీష్టము నెరవేరదు. ఆలాచేస్తేనా, వీడు మనపంచనే పడియుంటాడు. (అటుచూచి) ఎవరు ? ఓహో ! కృష్ణారావా ! దయచేయండి !

కృష్ణ—(ప్రవేశించి) ఏమి దయచేయుట ? నాభార్యచే కష్టములుపడలేకుండాయున్నాను. ఇంటికివెళ్లుటతడవు ! నాధా ! త్రాగుడుమానండి ! పుష్పం యింటికిపోకండి ! నన్నుమన్నించండి ! నామాట వినండి ! అంటూ ఉపన్యాసం ప్రారంభిస్తుంది !

పుష్ప—మీకింటివద్ద సుఖమెట్లు లభించును ? పైగానేను మిమ్ములను పాడుచేయుచున్నానని, అందరితోను చాటుతుందట ! దయచేసి యికమీదట మీరు మాయింటికి రావడం, విరమిస్తేనే బాగుంటుంది.

కృష్ణ—ఎంతమాట ? నేనునీకు ప్రియుండనై యుండగా రాధనిన్నేమి చేయగలదు ? మరెవ్వరు మాత్రమేమిచేయగలరు. ఇక దాని

మొగమైన చూతునా! అమ్మగారిమిగిలిన ఆస్తికూడా నీపేరవేసి దానికికూడుకూడ లేకుండాచేస్తా.

పుష్పం—నాపై అంతప్రేమయున్నదా?

[ అంత రాఘవరావు, రాధ ప్రవేశము. ]

రాఘ—ఉన్నది! లేకున్న మాకీకష్టములెందుకు? వీడిని నీవశముచేసికొని యిట్లు కల్కుచుంటివి.

పుష్పం—అదిగో! చూశారా! నేనేమియు అనలేదుగదా! ఏలా మెత్తిపోతున్నాడో చూడండి! ఈ ముసలి బూసినతోత్త! ఛీ! ఛీ! పో అవతలకు.

కృష్ణ—ఓరీ వృద్ధజంబుకమా! ఏమని ప్రేలుచుంటివి? రేపో, మాపో చావసిద్ధమైన వాడవని, తండ్రికన్న ఎక్కువైన వాడవనిన్ని ముసలి పందమని ఊరకుంటిని. లేకున్న. (కొట్టును)

పుష్పం—ఆ, ఆ! (అడ్డుకొనును.)

రాధ—అయ్యో! ప్రాణేశ్వరా! మీకిది తగునా? తండ్రికన్నఎక్కువవారే! అట్లుకొట్టవచ్చునా? తల్లీ నీవైనను దయచూడవా! నాకు పతిభిక్షపెట్టుము. (అని కాళ్లపైబడును.)

పుష్పం—ఛీ! ముండా, నేనేమిచేసితిని? నామీదబడి యేడుస్తావు. నా సౌఖ్యమునువీడి, నీకే సౌఖ్యమును కల్గించవలెనా? ఇక నేనిచ్చటనుండను. (పోబోవును)

కృష్ణ— ఆ, ఆ, నీవులేనిదే నేనుమాత్ర మెందులకు? మనయిరువురం కలసి యే హిమవత్పర్వతములకోబోయి, ఆశాద్వల నగముల మధ్య ప్రశాంతముగానుండుచో, ప్రకృతిని పరీక్షించుచుచూ, పరమ ప్రమోద భరితులమౌదము. రమ్ము! ఇచ్చటనున్నచో నీజంబుకదరియము. మనలను వీడదు. (పోబోవును.)

రాఘు—ఇక మమ్ముల నేమిచేయదలంచితివి నాయనా!

కృష్ణ—ఏమిచేయనెంచితినా? సుఖజీవనమునకు నప్పగించివెళ్ళెదను. ఇటురండు!

రాఘ—ప్రాణేశ్వరా! మాకు సుఖజీవనమువద్దు. మీ రెచ్చటికినిపోవలదు. పోని-యిచ్చటనేయుండుడు! నన్నుమాత్రము రోజు కొకటి-రెండు పర్యాయములు వచ్చుచుండనిండు. మిమ్ములను చూచుకొనుచు కాలము గడిపెదను. తల్లీ! నీకుకూడా సాయపడెదను. ఈయుపకారమైనను చేయుముతల్లీ!

పుష్ప—ఓనాతల్లిగదే! తల్లీ! రోజూవచ్చి పుల్లవేసి పోతూవుందువు గాని, చూశారా, ఎంతఎత్తెత్తినదో దొంగముండ, గుట్టంతా మోసికొనివెళ్లి నడివీధిని నింపుతూయుందువుగాని, అమ్మకే దుంపతెగా! ఎంతెత్తు ఎత్తావే?

రాఘు—(కోపముతో) పాపిని! ఏమి సంతోషించెదవులే, ఎప్పటికో నీకును యీాపరాభవమున్నదని గ్రహించుము. పెండ్లియాడిన భార్యకన్న నెక్కువైతివిగదా! ఇది ఎంతకాలమో చూచెదనుగాక! ఇల్లెంవరుకా లేదు. వలటకోర్కెలు ఎక్కువైనప్పుడు గాని, విటుని మతి తిరుగదు.

సీ॥ యాంనాముచీరలపై ♦ నత్యంత మోదంబు
జూపించి గర్వించు ♦ సుదతి యొకతె
స్లిపర్సు జతలనో ♦ సిల్కు రిబ్బన్సునో
దెమ్మనిశాసించు ♦ కొమ్మయొకతె
జడలపిన్నీసులో ♦ జిలుగున్న గాజులో
కొనిపెట్టుమనియెడి ♦ వనితయొకతె
లోలాకుజతలకో ♦ కాలియందియలకో
కలహంబు పెంచెడి ♦ కాంతయొకతె

సీ॥ కోరినదొసంగకున్నచో ♦ గోపగించి
ముసుగు బిగదీసి మూల్గెడి ♦ ముగుదయొకతె
విటుల నేప్పింప విసుగుచు ♦ విటులు సాని
కొంపద్రొక్కరు చెంపలు ♦ కొట్టుకొనుచు.

అప్పుడుగాని విటుడు, పెర్మనెంటో చెంపరరీయో తెలియ
వలెనుకదా! చివరకుగతి కట్టుకున్నయాలి! ఇకనైనను గ్రహిం
చు. వెనుకటిరోజులలో, విటులు వెంగళప్పలే! ఇప్పుడుసూం
త్రమది సాగదు.

కృష్ణా—నీవేనో వృద్ధమనిషివని కొట్టకుండా ఆపినందుకా, ఈవిధము
గ మాట్లాడుచుంటివి? నాయింటనుండి అనవసరముగా బేరిలికి
నా? ఇకచూడు! (గెంటును)

రాఘ—ఆ, ఆ, (అడ్డుకొనును)

రాఘు—నాయనా! కృష్ణారావ్! ఈ నీ పుత్రునిచూడు

కృష్ణ—ఏం? ఆడపిల్ల కాలేదనా?

రాఘు—ఐన?

కృష్ణ—ధన సంపాదనకు! సరే ఇటురండు! ఇకనా తుది పల్కులా
లింపుడు! (తాగి)

ఇరువురే బందుగులు నాకు ♦ తరచిచూడ
ముదము గూర్చెడి యీ నాదు ♦ ముదిత యొకతె
సర్వ సౌఖ్యంబు లిడెడు నీ ♦ సార రెండు
మూడవది నున్న నాకు నీ ♦ ముజ్జగముల.

రాఘా నీవు మంచి యౌవనములో నున్నావు, సానివృత్తికి
చక్కని వయస్సు, బ్రోకర్ వృత్తికి తగినవయస్సుగదా నాకువ

రావు, చీట్లు మోయుట కే చిరుతయున్నాడు! ఇం కేమికావ లెను? పొందావలెను. (గెంటును)

రాఘ——(మూర్ఛిల్లును)

(తెరవాలును)



ఐదవరంగము.

యో——(విభీషణు) (పాడుచు ప్రవేశ)

ఓ మహాజనులారా! మానవుడీ సంసారబంధమునుండి విడువడ సర్వోన్నతమైన దైవసాన్నిధ్యమును, బొందవలెనన్న, భక్తి, జ్ఞాన, వైరాగ్య, సత్ప్రవర్తనములు గల్గియుండవలెను. భక్తిగల్గి ప్రతిమనుజుడుండుట కష్టమే! జ్ఞానవైరాగ్యములలవడుట, కష్టాతికష్టము. కాని ఒక్కమనస్సును మనస్వాధీనము నందుంచుకొనిన. నీకలికాలమందు మనకు తప్పకముక్తి కల్గును. అదిస్వాధీనమున లేనిచో, ఇహలోక మందే నరకమనుభవింపవలెను. చేతనైన నితరులకు మేలు చేయుము! పరుల సొమ్ముకై యాసింపకుము. ఇతరులను జూచి యసహ్యపడకు! తప్పు జేసిన వారిని క్షమించి వారి తప్పును, వారికి దెలియ జేయుము. ఏక పత్నీవ్రతుడవుగమ్ము. తప్పక దైవానుగ్రహంబున కీవు పాత్రుడవగుదువు. (జపము జేయుచుండును)

కృష్ణ——(పాడుచు ప్రవేశం) నాదొక్క మనవి! మీరందరు, ఎల్లప్పుడు, కష్టమనునదెరుంగక, దేవతలవలెను, నావలెను, సదాసుఖముగ నుండవలెనని కోరుచో! సతతము సారాసేవనుచేయాలి!

ఇప్పుడెట్టి రోగములుగాని, కష్టములుగాని, మందకొడితనముగాని వచ్చి జేరుచున్నవి. శత్రువులు మిమ్ములను సమీపించ లేరు. అదిగాక భక్తిజ్ఞానములలవడి, మిమ్ములను బొందెతో, కైలాసమునకు గొనిపోవును. జపతపములు చేయనక్కరలేదు. కేవలము సారా సేవ వలనే, మీకట్టి యున్నతపదవి సంప్రాప్త మగును. ఉన్న ఆస్తుల నమ్మియైనను ఆస్తి లేకున్నచో, ఆలుబిడ్డ లనమ్మియైనను త్రాగండి! నిజమును చెప్పుచున్నాను.

యో — (తనలో) ఈతడే ఆనాటి. భక్తశిరోమణి భర్తృహృదయమును మార్పు ప్రయత్నింతుగాక.

కృష్ణ — అప్పుడే ఆనందము, బ్రహ్మానందం-అమర లోకప్రాప్తి! అదిగాక సొమ్మసిల్లేవరకు, త్రాగేవాడే మహా యుగపురుషుడు. ఆహా! హా! మరి మహాపురుషుడంటే యెవరని? కొండమీద దిగివచ్చాడా? ఎవరని మీయూహ? గొప్పవాడని యెవరైనం టారు పెద్దలు? మంచిరకం బ్రాందినిత్రాగేవాణ్ణి! గుక్కెడు త్రాగితే గుమ్మయిపోతాం! ఒకసారి లోటుగా త్రాగడంతోనే భగవద్దర్శనం! నేను గనుక రామానుజాచార్యులు చెప్పేసినట్లు ఉన్నరహస్యం కాస్త బయటపెడుతున్నా. మోక్షానికి నాతో కూడా రండి! నేనుముందు, మీరు వెనుక సెలవు (వెళ్ళబోవ)

యో — (సమీపించి) నాయనా! నీవు చెడ్డమార్గమున బోవుచుంటివి

కృష్ణ — ఓహో! యోగి పుంగవులా! మీవంటి సాధువుల దర్శనం చెయ్యాలని చాలారోజులబట్టి కుతూహలంగానుంది. మధిరాపానం వలనే మోక్షంలభిస్తుందని, నీకు బోధించి, మార్చవలసిన బాధ్యత నామీదవుంది. అయినా సమయం దొరకలేదు.

జ్యము లభించదు. నారకాంతలు, మధుపానము ఆ సామ్రాజ్య
మును చేరనీయుండా, ఈలోకమునకే బంధించు శృంఖల జాలములు.

కృష్ణ—సాధువుగారూ! మీకోసం రాకుండా యుంటే ఓ ప్రశ్న అడు
గుతాను, మీ రెప్పుడైనా భోగంవాళ్ల యింటికి వెళ్ళేరా? రహ
స్యంగా అయినా సరే లెండి! ఒక్క గుక్కెడు సారాయయినా త్రా
గారా? ఆలాచేయం దే వాటిలో నష్టముందని, చెప్పటానికి—
మీ కేమి అధికారముంది?

యోగి—నాయనా! శ్రీరామనామములోగల మాధుర్యమును, నీవు
రుచిచూచినచో, ఈతుచ్ఛభోగములనాశింపక, సదా శ్రీరామ
పాద, సన్నిధినే జీవించియుందువు.

కృష్ణ—నేను అదే మనవి జేస్తున్నాను. ఖర్చు నేను పెట్టుకుంటాను గాని,
తమకొకసారి భోగంమేళానికి వెళ్ళికూర్చోండి! నాట్యం చేసే
సమయంలో, మద్దెల, ఫిడలు, గజ్జలు, తాళముకలయటంవలన
బయలుదేరే నాదం వింటే, శృంగార రసాన్ని, వెదజల్లే, ఆము
ఖాలనుజూస్తే, ఆనందో బ్రహ్మ యనే మాట స్మరించుకుంటూ;
మీ కాషాయిగుడ్డలను తాకట్టుపెట్టి, ఒక "బీడీ" అయినాకొ
నుక్కొనివచ్చి, ఆయువతుల నామాన్ని స్మరించుకుంటూ,
అమృత మధుసంకోసం, దేవతలు బాధపడినట్లుగా, యువతుల
అధరామృతానికి మీరు ఘోషిల్లుతుంటారు.

యోగి—నాయనా! వైకుంఠమున భక్తులకు లభించు ఆనందమును,
నీవెరింగినచో, ఇట్లువచించియుండవు. ఆనామము లభించినచో
సంసారసాగరమును సులభముగ తరింపనచ్చును ఎట్టికష్టములు
ను రామనామముచే పటాపంచలైపోవును.

కృష్ణ—చదవటానికే బాగుంటుంది. చాలా పరీక్షలు వస్తాయని వాటిని

జయించటం, చాలాకష్టమని, పురాణాలే ఘోషిస్తున్నాయి, కాని ఒక్కబొట్టు సారాయి, లోపలకి, వెళ్ళిందంటే సంసారంలోనుండే కష్టాలన్నిటిని, మరపించి, వేరొక లోకంలోకి, మనలను తీసుకొని, పోయి, కవులు కూడా వర్ణించలేని, ఆనందాన్ని కలుగుస్తుంది. ఎంతవర్ణించినా అనుభవంలేనిదే లాభంలేదు. మీరీ పద్ధతులను మార్చుకోవాలనిష్టమున్నాకే! నాస్వంత ఖర్చులమీద మీకు శుద్ధిస్నానమిప్పిస్తాను. లేకపోతే మీఖర్మం. అయినా పూర్వజన్మ సుకృతంలేనిదే ఇటువంటి భాగ్యముపట్టదు. మళ్లీవస్తాను. (పోవును)

యోగి—(నిర్ఘాంతపోయి) ఆహా!... (పాడుచుబోవును)

(తెర వ్రాలును)





# పుష్పరాజ్యం లేక రాధాకృష్ణ.

## చతుర్థాంకము.

### మొదటిరంగము.

(శ్రీకృష్ణా రాధావృక్షల్లు—నారాసీపాను బల్లపైనుండి పాడుచున్నారు)

రాధ—అమ్మా! సురాదేవి! నీ మానవుని, మర్యాదలు, ... క్రమములు, రూపురేఖలు, ఆహారముగా, కావలయునా? ఆహా! నీశక్తి వర్ణనాతీతము, ఎంతటి వివేకినైనను, జ్ఞానినైనను, నిమిషకాలమున, నీచుని గావింతువు. నీబలమమోఘము. నీ వెంత దూరమునుండి వచ్చినను, నిన్నుజూచి మేము తొలగుచుంటిమి గాని, నీవుమాత్రము తొలగుటలేదు. నీ కింతోపు వ్యభిచారముండ వలయునా? తల్లీ! నీవెందరి భర్తల నిట్లు పాపజేయు చుంటివి? ఎందరు స్త్రీ లిట్లు వెతలకు లోనగుచున్నారు?

సీ॥ చిలుక గోర్వంకల ♦ స్నేహంబు జెఱచియు
కాకి గూబలపొందు ♦ గలపినావు!
మన్మథ రూపుని ♦ మార్చివేసి యుదన్ను
కోతి రూపుని జేసి ♦ కులికినావు!

బంగారు కెనడాయెప ♦ సింగారు గుణవంతు
త్రాగుబోతుంగ జేసి ♦ తనరినావు!
లక్ష్మీనివాసమా ♦ రాజ్యంబు నమ్మించి
పరులకొంపను జేర ♦ వ్రాసినావు!

అహాహా! సారాపిచాచమా ♦ యంజలిడుదు
నింకనైనను మము వీడి ♦ యేగుమమ్మ
యెచటినుండియో వచ్చితి ♦ యిచటికెపుడు
మాదు దేశంబు మన్నుగా ♦ మార్చకమ్మ॥

తల్లీ! నీకు పదివేల నమస్కృతులు.

కృష్ణ—(ప్రవేశించి) దట్సిజ్ గుడ్! దానిలోనిక్కు వచ్చావన్నమాట! ఏదీ మై ఎంబ్రేస్—ఒకముద్దు పెట్టు. బాటిల్ మాతనిపూజిస్తు న్నావుకదా! చాలామంచి పని జేస్తున్నావు! సారా సేవే సర్వేశ్వరసేవ. ఏకిక ముక్తిక్షేత్రోవ పూజించు. ఒక్క పరమ రహస్యం చెబుతా విను!

నిరతము సారా సేవను
అరమర లేకంజ జేయు ♦ నార్యుల కెపుడున్
పరమాత్మ సాయ మబ్బును
పరమార్థము దెలిసికొంటి ♦ పడతి రో తుదకున్.

సెయ్యి! పూజసెయ్యి! బాండెత్తోనే కైలాసం. దానితో మనం ఆలోకంలోకూడా భార్యాభర్తలుగా నుండవచ్చు.

రాధ—(సమీపించి) ఏమండీ! ఆసీసాఏది! చూడనివ్వరూ! (చూచి) సీసాకాదది. బాంబు-అదియైనను మంచిదే ప్రేలి యొక్కసారిగ ప్రాణముల దీసి యిహలోక కష్టములబాపును. ఇది యంతకం

కు వేయి రెట్లు భయంకరమైనది. బ్రతికియుండగనే, యిహపర సౌఖ్యములకు దూరముజేసినూనవ్వులను బీల్చి పిప్పిజేయు మహా మ్మారి! (సీసాను బట్టుకొన బోవును)

కృష్ణ—ఏయ్! దూరముగానుండు. దేవునిముట్టు కొనుట, కింకాద గు శక్తిరా లేదు—తగవు—పాప పరిహారార్థం సారాసేవ చేయాలి ఏమేయ్! మాట దగ్గరకురా! నీవు నాకేమౌతావ్ ?

రాధ—మీపాద దాసిని! భార్యను! అర్థాంగిని-

కృష్ణ—ఏమిటీ? భార్యవా? అర్థాంగివా? ధర్మపత్నివా? గృహల క్ష్మివా? సుమంగళివా? పర్యాయపదాలు తూకంగా చెప్తావు న్నావ్—సరే! నీవు భార్యవే! మరి-అర్థాంగి-గృహలక్ష్మిఏది? ఈ లెక్కప్రకారం నీవుతల్లివి! ఏమంటావా! మాతృదేవత అన్నారుతల్లిని, మరి ఈ అవతారాల్ని బట్టి ఆలోచిస్తే నీవొక దేవతవు! మాతృదేవతవ్! నిన్ను నీ వేలాచూచుకోవాలి?

రాధ—దైవాధీకంగా!

కృష్ణ—కా-నీదేముణ్ణికాదు నేను!

రాధ—ఆ, ఆ, కాకపోవుయేమి! అమంగళము ప్రతిహతమగుగాక.

కృష్ణ—అట్లయిన-ఈదేవుడు-ఈ నీ దేవుడు-ఈజీవుని రూపంలో పనగ లన్నీ కావాలంటున్నాడు! యిస్తావా?

రాధ—(ఉలికిపడి) అయ్యో! ఏమిది? ఇక నగలు కూడ నున్నవా? నాథా! నగలెక్కడివి? ఇక మంగళసూత్రములు మాత్రమే మిగిలియున్నవి. (కండ్లకద్దుకొనును) ప్రియా! అమంగళవాక్య ములట్లు బలుకరాదు.

కృష్ణ—ఏయ్! వెఱ్ఱిమొహమా! నీకొక్క పౌరాణిక తాత్పర్యాణం

ర్వం సమస్త శాస్త్రాలు చక్క బెట్టిన, ఆ హరిశ్చంద్రుడు, చం
ద్రమతి, మంగళసూత్రం, అమ్మమని సలహా చెప్ప లేదు! ఆజ్ఞా
పించ లేదు? పరిస్థితిని వైపరీత్యంగా జేసి నిర్బంధించ లేదూ? పం? ఆ
మె హైందవ స్త్రీ కాదూ? నీవు నేర్చిన "అమంగళం" అనాచా
రం, ఆచంద్రమతికి చేతకాదూ? హస్తాలా మరి మాంగల్యానికి
దైవాహికమైన, నిపతి హస్తాంజలియందు నిమాంగళ్యమ్ము యుం
బుంచి, నిజమైనపతి సేవా పరతంత్రయని వన్నె కెక్కె! (చేతి
కత్తి చేయి జోపును)

రాధ—(విదలించుకొని) పాణేశ్వరా! మగువ కంఠాన మాంగళ్య
ము లేకున్న తన సౌమంగళ్యానికి కీడుకాదా? యోచింపుడు!
ఈనాభాగ్యమునుంచరా! మీకాళ్ళంటి మ్రొక్కెదను! ఋ
న్నింపుడు! అట్లుమన్నించ రేని, ముందీ మగుప్రాణములు హరిం
చి, మీతృష్ణ తీర్చుకొనుడు! అప్పుడుగాని నామాంగల్యంబు
మీకు దక్కదు.

కృష్ణ—మటప్! (కత్తినిచూపి)ఏయ్! ఇస్తావా? యియ్యవా?
(కూలబడును)

రాధ—అయ్యో! వీరికిప్పుడు తెలివిదప్పినట్లున్నది! నెమ్మదిగ మంచి
మాటనుజెప్పితప్పించుకొనుటయే, యుక్తమనితోచెడిని!నాథా!

కృష్ణ—నాథా లేదు--న్యాయం లేదు--ఇయ్యి త్వరగా!

రాధా—(చేయిపట్టుకొని) లోనికిరండు! ఇచ్చెదను.

కృష్ణ—లోని కెందుకు? రాఘవరావుతో ఫిర్యాదుచేస్తావా?

రాధ—కాదు! రండి! చెపుతాను--

కృష్ణ—(నవ్వి)ఓహో! అదా సంగతి పసుపుకొమ్ము కట్టుకొని, పీటని పోడఉన్నానన్నమాట

(నిష్క్రమింతురు)

(తెర...)



రెండవరంగము.

(పుష్పం ఇల్లు—పాడుచుండును)

పుష్పం—అనుకున్నదంతా పూర్తియైనది. ఈవృత్తి ... సంగానున్నట్లు కనపడదు. ఈముగ్గురిలోను ఎవరెకేమందు ... చెప్పాటయో తెలియకున్నది ఇక చెప్పవలసివచ్చిన ... శాస్త్రికి తర్వాత జెప్పవలయును కృష్ణారావుకు ... యిక మన బ్రతుకు నడుగనక్కరలేదు! పోని! నమ్మిపడియున్న ... నలనాసాంతము సరిగ జూచునో లేదో? ఇప్పటికే అచ్చటచ్చట పంచరిస్తోన్నట్లు, తెలుస్తోంది. నేనిక నీతసపట్ల జాగ్రతగా నుండి ... నైతినేని దిక్కుమాలిన పక్షివలెను, రెంటికి జెడ్డ రేవడివలెను కావలసి వచ్చును.

శెట్టి—(ప్రవేశం) పుష్పం-పుష్పం (కేకలువేయును)

పుష్పం—అదుగో ఒక పిశాచి (పైకి) దయచెయ్యండి!

శెట్టి—(మంత్రములను జపించును) ఓం; హ్రీం, హ్రైం, క్లీం హ్రాష్, శామ్, శీమ్,-జేమ్-డూమ్! పట్, పట్! (పైటలాగును)

పుష్పం—ఎపుడూలేనిధైర్యం, ఈరోజున పుట్టిందే!

శెట్టి——కాలచక్రం ఆలా వక్రంగాతిరిగిందికే ! (మంత్రములచదువును)

పుష్పం——ఆ, తిరుగ వేం ! తిరుగుతుంది (చెంప పై కొట్టును)

శెట్టి——భేష్ ! యోగి చెప్పనే చెప్పాడుకదా ! ఆవిధంగానే జరిగింది. మోట సరసంలో దిగితే ప్రేమ పుట్టిస్తే అన్నాడుగా ! ఇక పుష్పం మన వశమైనట్లే ! (చేయిపట్టుకొనును)

పుష్పం——(మొట్టును)

శెట్టి——మొట్టునని యోగి చెప్పేడా లేదా ? చెప్పకపోతేనేమి ? మొట్టడం మోటసరస మేనా ! కాదా ? ఇంక నా జన్మతరించింది ! (మెడపైచెయ్యి వేయ బోవును)

పుష్పం——(కొట్టును)ఏయ్ ! పిచ్చెక్కిందా ? లేక మదమా ? మీదిమీదికి వస్తున్నావు !

శెట్టి——ఊబాయింపు ! బజాయింపు ! బజాయింపుతీసి గారంగా పెట్టు.

పుష్పం——బయటకు పోతావా ? లేక నడి వీధిని పెట్టమందువా ?

శెట్టి——(మంత్రపఠనచేయుచు కౌగలించు కొనబోవును)

పుష్పం——(విదళించుకొని) (తనలో) ఇట్టి దృశ్యమును కృష్ణారావు జూచిన, మున్ముందతనిని నేనే మనుటకు వీలు లేదు. (రెండుచేతులు బట్టుకొని) ఏమిటి శెట్టిగారూ ! మీకు పిచ్చి ఎక్కిందా ! లేక తాగివచ్చారా ? మంత్రా లేమిటయ్యా.

శెట్టి——(తనలో) మంత్రం పట్టిచ్చింది. ఎందుకంటూరా చేతులు గట్టిగా నొక్కుతుంది !

శాస్త్రి——పుష్పం--పుష్పం- (కేక వేయును)

శెట్టి——అమ్మయ్యో ! కొంపమునిగింది ! వదలు-చేతులు వదలు. ఈనచ్చినోడు ఇప్పుడే తయారవ్వాలా ? కలకాశీనుగుల్ని ఎన్నికటిని మోసినా ! మొన్నజాడ్యాలలో మాత్రం జారాడు కాదుష్

డు. పుష్పంసి కాళ్ళకు మొక్కుతా! నాకింటు బతకండా చేయ్యాలి!

పుష్పం—(బల్లక్రింద దాచును)

శాస్త్రి—(ప్రవేశం) ఏమిటంత తొందరగా ఉన్నావ్ ?

పుష్పం—అబ్బే! ఏమీ లేదండీ! తమకు తలుపు తీయటం ఆలస్యమయ్యింది! ఏమనుకుంటారో అని!

శాస్త్రి—(సిగరెట్టుకాలుస్తు కూర్చునియుండును)

శెట్టి—దీనిసిగరెయ్య! పేడంటే దీనికంత ప్రేమగావున్నది. ఈసమయములో, పింకర్ కృష్ణారావు రావాలి! మాకేమిగా కూర్చున్నాడు పంతులు.

శాస్త్రి—పుష్పం! ఏమిటి? విశేషాలు! ఈమధ్య చాలా ఖర్చు భాగంలో పడ్డానన్నావు కామా! ఏం! గదిఏమైనా చక్కాచేయించావా? ఏమేమి అలంకారాలు చేశావ్! పద చూద్దాం! (చేయిపట్టుకొన బోవును) ఏలాగైనా నేనంటే చాలా ప్రేముందిసుమీ! నీకు.

పుష్పం—కాకేం? మీమీద నున్నవల పంతా నాకంటికి పట్టింది. చూడండి! వెనకాముందు మాయిచ్చి చచ్చినట్లు.

శాస్త్రి—దానికేం! చేయిద్దాం! ఏదీ-చూడు పరుపు క్రింద వస్తువుల కేటలాగు పెట్టేను-నడు ఏ మోడల్ నచ్చిందో చూడు! ఆప్లేటు యింటికనుకోకుండానే ఇట్టేచేయించేస్తా-నడు.

ష్పం—మీరిచ్చిగాని-మాటలతో నెప్పుడునరిగాదు. మాకడుపు నిండుతుందా?

శెట్టి—అవును-మీరుదంప తెగా! మీకెంత ఆకలి లేక తంత మందిన్ని మీపొట్ట నెట్టుకుంటారు!

శాస్త్రి—పుష్పం! మనమిద్దరం ఒకటే! మేనులు రెండు-ప్రాణ మొకటి! నిన్ను చూడలేనిదే నేనుండలేను. నన్ను జూస్తేం దేమాత్రం సహించ గలవా ?

పుష్పం—మీగోల నాకు తెలియదుగాని? నేనుమాత్రం మిమ్మల్ని చూడకపోయినా హాయిగానుంటాను.

సీ॥ విరూపమును జూచి ♦ నిర్వ్యాజ పటుతయా
　　వారకాంతలువచ్చి ♦ పక్కనిల్చు
విద్య దిలకించి ♦ నీకై కొనియాడియా
　　వారభామిను లెప్డు ♦ పల్కరించు
వినయ సంపద జూచి ♦ ప్రణుతించియా నిన్ను
　　దరిజేరు! భోగంపు ♦ దన్విగణము
నీసంపదల జూచి ♦ యీసు జెందియ వార
　　తరుణులు బోధింత్రు ♦ మరుని శాస్త్ర
మతుల చరితంబు గాంచి ♦ ధన్యస్మయనియ
　　పలుకులెప్పుడు నిన్ గాంత్రు ♦ కుటిల దృష్టి
నెట్టి పెద్దమ్మ ధనమెగా ♦ వేశ్యకెప్డు
　　భర్త, యెవ్వని కడనుండు వాడెభర్త॥

శెట్టి—ఇప్పుడు తెలిసింది ముండాకొడుక్కి! బలే సమాధానం చెప్తోంది! చావుపంతులు! నీరులేని కయ్యలోపడి!

శాస్త్రి—పుష్పం! ఎన్నడు లేని నిర్దయ కలిగిందేమి? నామీద సదభిప్రాయంలేదా ?

శెట్టి—ఇలాంటి అభిప్రాయమేఉంది! వెనకోపాలి ఇటువంటి కేసుల్లో నాబావమరది సచ్చినోడు, అని-అనీ-తిన్నాడు!

పుష్పం——లేకేమి! ఇకమీద స్నేహాభావం!

శాస్త్రి——ప్రేమభావం, మాత్రం లేదన్నమాట!

శెట్టి——నో-నో-యిడియట్-గెటవుట్!

పుష్పం——ఉండదు.

శాస్త్రి——ఆహా! ఎంతమోసంజేశావు?

శెట్టి——ఛీమ్! ఇదిగో చెప్తా! అందుకొని పళ్ళు రాలగొట్టి, నంతా తో "లవ్" చేస్తేనే దిక్కు లేదుగందా నా...నీకా ...!

శాస్త్రి——నిజమేనా?

పుష్పం——నిజమే! ముమ్మాటికి నిజమే!

శాస్త్రి——ఇకమీదట నా గతియేమి?

పుష్పం——అధోగతి! నాగతిమాత్రింపమిటి?

శెట్టి——నీకేం! ఊరికే ఉంటావంటే ఎవ్వడూ నమ్మడు!

శాస్త్రి——ఎంత మోసము చేసితివి?

కృష్ణ——(తూలుచు ప్రవేశం)

శాస్త్రి——అమ్మయ్యో! కొంపమునిగింది. కృష్ణారావే? నాపాపిష్టి రక్షించాలి, నీవేంచెయ్యమంటే అదిచేస్తాను

శెట్టి——అమ్మయ్యోయ్! బ్రతుకుసరి! పిలక సంబరం తాపాన్నదమ్మ మాటే!......

పుష్పం——(తొట్రుపాటుతో) శాస్త్రినికూడా దాచును. ఒస్తున్నా! ఒస్తున్నానండీ! అయితే కృష్ణారావుగారూ! ఇంతఆలస్యమైందేం? రానియ్యలేదేమి! రాణీగారు?

కృష్ణ——వేరురాణీ ఎవరు? నీ వే గా!

పుష్పం——నేనెట్లా అవుతాను?

(శెట్టి శాస్త్రిని గిల్లుచుండును-గిల్లొంచవని శాస్త్రి-కంగారు)

కృష్ణ—రాధాబాయీ లేదు! రాయీబాయీ లేదు!

పుష్పం—ఆ-ఆ-ఆ! అల్లాఅంటారేం? ఆమె మహాసాధ్వి

కృష్ణ—నీవుమాత్రం సాధ్వివి కావూ?

పుష్పం—నాసాధ్విత్వానికేంగాని డబ్బందిందా?

కృష్ణ—లేదు. రేపు తప్పక అందుతుంది.

పుష్పం—(కోపంతో) రేపు మాపులతో కాలక్షేపం చేస్తోంది. సీసా లెల్లా వస్తాయ్?

శెట్టి—అదీమాట! వీడన్నా వాలక్యాం లేదు!

కృష్ణ—రేపు తెస్తానన్నానుగా! సణుగుడెందుకు?

పుష్పం—అంతా మీ మాత్రానికే-మీకు సమర్పించాను.

కృష్ణ—అంతా నాకోసమైతే నా మాత్రానికి కోసమైతే సమర్పించావా ఏమి మాట!

పుష్పం—(పెడమొగంతో దూరమున నిలబడి) ఆ-సమర్పించాను.

కృష్ణ—డబ్బు లేకున్నా, నాకిచట సుఖము లేదన్నమాట!

పుష్పం—అది నే నెట్లు చెప్పగలను?

శెట్టి—వీడంటే అసలే విలువ లేనట్లుంది! మన మంత్రాలు గాని పట్టిచ్చినాయేమో!

కృష్ణ—రెండుగాని లేక ఒక్కసీసాయైనా లేదా?

పుష్పం—సీసా లెక్కడున్నాయ్! దయచెయ్యండి!

శెట్టి—తిట్టనుపోరా! వచ్చినోడా! అన్నట్లుంది దీనిమాట!

కృష్ణ—(లేచి) వస్తాను! సెలవ్!

పుష్పం—మరియొక విధంగా ననుకోకండి! (లోనికి పోవును)

కృష్ణ—ధనమెక్కడనుంచి వస్తుంది? అడక్కేంటే మళ్ళా లేదు-నుడ తీరాదు. అప్పెవరిస్తారు? దీనిని గుణించి గడదంతా కడిగివేశాను ఏమీ తోచడంలేదు. (చికాకుతో) క్వీర్ వరల్డ్! నావంటి కేం భావంతునకే స్థానం? వరదం లేదు, ఆల్ రైట్! ఈసారికి కూడా రాధ మంగళసూత్రమమ్మితేనైన డబ్బు తీసికొని వెళ్ళుతున్నాం! (ఆలోచించి) మనకక్కర్తి కొలది ఆత్మగౌరవం చంపుకొని దాన్ని మంగళసూత్రమిమ్మనమంటే- అపాట్ని పెద్దపెట్టున రాంతం మొదలిడుతుంది—పోనీ పుష్పం! కొద్ది ఓపికపట్టమంటే ఇష్టపడజేసిన గౌరవమే! పోని ఇంటికిపోయి దాన్ని నట్టింట నిర్బంధించుదామంటే రామబందు పక్షిలా వాగొకడు! నిన్న నగలడిగినందులకేగా! చేతినుండి చల్లగాజారింది! వీళ్ళిద్దరితోనూ భరించలేకుండాయున్నాను. వాళ్ళిద్దరను కడతేర్చిన గాని పుష్పంవద్ద పూర్తిగా సౌఖ్యం లభించదు- అందుకై గాఢంగా ప్రయత్నం చెయ్యాలి! శెట్టి—శాస్త్రి ఉండనే ఉన్నారుగా! ఇదియే చక్కని ఉపాయము! సమయానికి బుఱ్ఱ పనిచేసింది! తెలివివట్టినే పోతుందా! (వెళ్ళును)

తెర వాలును.

---

## మూడవ రంగము.

(రాధ కృష్ణవిగ్రహము చెంత కూర్చుని పాడుకొనుచుండును)

రాధ—కృష్ణా! దయజూడవా? నానాథుని మనస్సు మరల్పవా?
దయామయా! నాజీవితేశుని పాదపంకజముల కండ్లనద్దుకొని

చాలాకాలమైనది. నాకదిజేసి నాకడగండ్ల దీర్పవా? భక్తవత్సలా! భారతాంగనకు భర్తసౌఖ్య మెల్లప్పుడు కావలెనా? వేళకు ముఖముజూచిన నంతియేజాలును. (విచారించుచు) ఒక్కనిమిషము భర్తముఖము జూడకుండిన స్త్రీకి మనశ్శాంతియుండదు.

శాం—(ప్రవేశించి) అమ్మా! నీవిటులనే విచారించుచు కూర్చుండిన నాకు మనశ్శాంతి యుండదు. తల్లీ నీవు కొంతధైర్య మవలంభించుట యుగత్యము. నీవట్లు విచారగ్రస్తవై విశేషకాలముండుటచే నీ చింత చాలబెంబోలుపడియున్నాడు! ధైర్యమునవలంబింపుము. నీ భర్త నడవడిక ఎప్పటికైనను మారగలదు. ఇటువంటివారలే మతి తిరిగిన గొప్పజ్ఞానులౌతారు.

సీ. పతి దర్శనంబె యా ♦ పరమేశు రాకగా
భావంబునను నెంచు ♦ భాగ్యరాశి
పతి భుజియింపక ♦ పచ్చినీళ్లైనను
నోటబోయని యట్టి ♦ నీతిమతివి
పతి గూరుకకమున్న ♦ పాటిదప్పియు నెప్డు
తెప్ప వాల్చనియట్టి ♦ లేమవీవు
పతి యూరలేకున్న ♦ వెతజెందు మనముతో
శృంగారములు మాను ♦ సుదతిమిన్న

గీ. ఇన్ని పతిభక్తి లక్షణా ♦ లెన్నియున్న
నీకు సుఖములురాకున్న ♦ నేరికొదవు?
దిగులుపడకుము తల్లిరో! ♦ ధీరవగుము
చేవ్రుడిచ్చు నీదుధవునకు ♦ దివ్యబుద్ధి.

నాగే—పెద్దలవాక్యములు పెడచెవిని బెట్టరాదు. ఎప్పటికైనను నా నాథుడు సత్ప్రవర్తన గలిగియున్న నంతియేచాలును. తమ చేతిలోని కాగితము లేమి బాబూ!...

రాఘు—ఇవి ఆస్తికి సంబంధించినవిలే! మనవే!

నాగే—మనకింక నాస్తికి సంబంధించిన కాగితములుకూడ నున్నవా?

రాఘు—అట్లు నైరాశ్యము జెందకమ్మా! ధనము కొంతతీసి కొంత భూమిని కొని నీ కుమారునిపేరిట వేయించితిని. ఇదుగో చదువుము—

నాగే—ఏమి మీ దయ? మీ ఋణమును దీర్చుకొనజాలను ఇవి మీ వద్దనే యుంచుడు. నా భర్త మనస్సు తిరుగునంతవఱకైనా! అంతదనుక నిట్లే యుండెద. బిడ్డనుమాత్రము మీరు రక్షించుచుండుడు.

రాఘు—అమ్మా! బిడ్డనుగూర్చిన బెంగ నీ కావంతయునవలదు! నీ వింకను నిట్లే విషాదముగనున్నచో మనోవ్యాధి బాగుగ ప్రబలి మతిభ్రమణ మయ్యెడిని! దానివలన నీ భర్త సత్ప్రవర్తనుడయ్యు మీ జీవితఫలము నిష్ప్రయోజనమే! కావున నీవు కొంతధైర్య మవలంభించు తల్లీ!

నాగే—వారా త్రాగుడు-వ్యభిచారముమాని యెప్పటియట్ల సజ్జన సాంగత్యము, బహుశ్రుతులతోడి కాలక్షేపముజేయుచు నొంత యాస్తి యున్నదని గ్రహించినపు డెంతగా సంతోషించెదరు? ఆ విధముగ పరిణామమును జెందినచో నా కెట్టి సంతోషములు గాని, శృంగారములుగాని, భోగభాగ్యములుగాని యక్కఱ

కృష్ణ—ఉస్! గొడవచెయ్యకు! నీవు చేయకపోతే తీరదు మనకు! చాణక్యుని మరిపించు శాస్త్రి! శాస్త్రిజీ! ఇలారండి! మీ ప్రాణమే నా ప్రాణం! మీరు నిజంగా నా బ్రదరనుకొంటున్నాను. ఈ కార్యము తప్పక మీచే కావాలి.

శాస్త్రి—(సగర్వముగా) ఆహా! అదెంత? చెప్పండి! అంతగా పొండాలా? సెలవియ్యండి! నిమిషంలో తీర్చివేశేస్తాను!

శెట్టి—(వణకుచు) అబ్బో! ఎంతధైర్యం! చెబుతామంటు! నా చెంబు కంగవస్త్రం బిగించి దండయాత్రల చేద్దువుగాక!

కృష్ణ—అటులైన వినురమ్మా! (దెసలు పరికించును).

శాస్త్రి—త్వరగా చెప్పండి! తెల్లవారవస్తోంది.

కృష్ణ—మన మిరువురం స్నేహితులంకామా?

శాస్త్రి—కాకపోవడమేమిటి? కాదని శ్రీదాక్షిణ్యం కలగచేస్తున్నారా? ఎవరైన ఈర్ష్యతో?

కృష్ణ—స్నేహబృందం ఎలాఉండాలి?

శాస్త్రి—హుషారుగా, జలాసాగా - ఖుషీగా - సగర్వంగానూ ఉండాలి!

కృష్ణ—మిత్రబృందంలో నెవరికైనా ఒకరికి ఆపద వస్తుంది, అప్పుడు.

శాస్త్రి—ఆపదవచ్చినప్పుడే మరి ఆదుకోవటం! మిత్రబృందమంతా! లేకపోతే ఇదంతా పకోడీబృందమే!

కృష్ణ—నే నేదో మీతోపాటు ఖుషీగా ఉందామని వుహాశించాను. కాని... ...

శాస్త్రి—అబ్బ! ఆ నిస్పృహా ఏమిటండీ? చెప్పండి! అంతాకాదు నేనైనా......

కృష్ణ—నా నిరంతర సంతోషాన్ని అంతరాయం ఎంతగానైనా ఆక్షణం కల్గుతోంది! అనవసరంగా... ...

శాస్త్రి—ఆ అంతరాయ మెంత యనివార్యంబైనను నివారింప సిద్ధమైన శాస్త్రి మీకు వాగ్దానం చేస్తున్నాను! త్వరగా చెప్పండి! నా నాడులలో వేడిరక్తం వెల్లువలై తరంగాలతో ప్రవహిస్తోంది! ఆ తరంగాఘాతాల ధాటికెంక సైపనోప. తెల్లవారనున్నది! త్వరితముగ కృతకృత్యుడనై యీ నా ప్రియమిత్రునకు (కృష్ణారావును తట్టును) కృతజ్ఞత చూపుతా! త్వరగా చెప్పండి!

కృష్ణ—ఆ రంభ శూరత్వమేనా? లేక ...

శాస్త్రి—ఛా - ఛా - అది ఆడపని!

కృష్ణ—అటులైన శాస్త్రీజీ! ధైర్యము చిక్కబట్టుము. మన మిత్రత్వమును మనోవీథియందుంచుము - నీ కార్యమందే లగ్నచిత్తుడవగుము. నేను బహిఃకవాటముకడనుండి, నీ పైకి దోమనైనరానీయను. ఇటురమ్ము - నీ తొలిప్రతినను, జ్ఞప్తికి తెచ్చుకొనుము. అటు జూడు (రాధను జూపును) ఆ వ్యక్తియే! ఇదిగో వాడియైన కృపాణము - ఊ - కానిమ్ము! ప్రతిన నెరవేర్చి యీ నీ మిత్రుని, ఆశాసౌధాలలో, నానందదీపములను వెలిగించుము. ఆ పైన నాచే; బ్రహ్మాండముగా బహూకరింపబడుము - ఊ - కానిమ్ము - ఊ - ఊ!

శాస్త్రి—(తెల్లబోవును.)

కృష్ణ—దీనిని చేతితో గట్టిగా పట్టుకొనుము!

శాస్త్రి—ఆ, కత్తి - యే! - నా చేతిలోనే? క్షమించండి!

కృష్ణ—అటు లోనికిబోయి ఆ మంచముపై పడున్న స్త్రీని - ఆ - ఊం -

శెట్టి—(బిగ్గరగా) రంగా! రంగా! శ్రీరంగా - శ్రీరామచంద్రా! కృష్ణా! పోలేరమ్మా! పెద్దింట్లమ్మా! నూటొక్క దేవతల్లార్లా? పేర్లురావు క్షమించండి! మీరే రక్షించాలి? నూ ఆవిడ, వెళ్ళొద్దని ఎన్నిచెప్పినా వినలేదు!

కృష్ణ—ఏయ్! డండర్ హెడ్! ఏమిటీగోల? షటప్! (నోరు మూయును.)

శాస్త్రి—నుదుట ఈ విభూతి రేఖలేమి? శిరముపై గోష్పాదమంత పిలకయేమి? నా యెత్తినజన్మమేమి? బాహ్యాగాంభీర్యమేగాని, నా హృదయమెంత? ఈ సనికి నా వంటి - అమ్మయ్యో! నా హృదయ మాగిపోయినట్లున్నది! నా కన్నులు తిరుగుచున్నవి! కంఠస్వనముకూడ తగ్గిపోవుచున్నది! కృష్ణారావు గారూ! క్షమించి నన్నీ కార్యమువట్లతప్ప, వేరు కార్యాచరణలకై - నియోగింపుడు - అసమర్థుడను-

కృష్ణ—ఇక నీ వలన నీ కార్యము కాదన్నమాట!

శెట్టి—పంతులూ! గట్టిగా కేకలైనా వేద్దాం! ఆ కాస్తపని అయ్యేలాగుంది!

శాస్త్రి—కేకలువేస్తే ఆ కాస్త పని మనకు జరిగితీరుతుంది,

కృష్ణ—(లోనకుబోవును. శెట్టి, శాస్త్రి వెంబడింతురు.)

(తెరబడును.)

---

## ఐదవ పరంగం.

(రాధ, వెంకటరమణ పడుకొనియుందురు.)

కృష్ణ—(మాయావేషముతో ప్రవేశం) (రాధను సమీపించి) ఖడ్గ రాజమా! కాలసువర్ణా, నా హస్తముచే బడితినని విషాదమును బొందక, కాంతాకంఠమును దునుమ జంకక, క్షాత్రమును ప్రదర్శించి, రాధా శిరచ్ఛేద మొనరించి, నాకు, నిరంతర సంతోషము చేకూర్పుము. భారతమాతృగర్భమున జన్మించిన వీరాధివీరుల కరముల నలంకరించిన, నీవు, జగద్విఖ్యాతి నొందు దుష్కార్యముల శంకకంజవేయుము. రాధా! నా భావిసంతోష దీపమును నిర్మూలించి, ప్రచండవాయుతరంగముల, రేకెత్తి తేకి, పుష్పక్రోధగాఢాంధకారమున, లోకమును నిర్మూలింప యత్నించు, నీ సాహసమునకు ఫలమనుభవింపుము. (మరల రాధను సమీపించి) ఏ సౌందర్యమును దిలకించి, ముగ్ధుడనై మహోరాత్రముల స్మరించుచు, బ్రహ్మానంద మొందితినో, ఏ సద్గుణరాశిని, అర్ధము చేసికొని, మననంచేసి, అట్టి యుదార స్వభావకు, భర్తయగు సదృష్టముపట్టెనని, గర్వించితినో, ఏ సుమధురకంఠగానముల విని పాపపంకిలమునమగ్నమై దుఃఖాక్రాంతులదాల్చు, మానవుల, నుద్ధరింప, నవతరించిన స్వర్గీయ జ్యోతియని, భ్రమజెంది, ఆనందాబ్ధివీచికల నుఱ్ఱూతలూగితినో, ఏ యువతి కరస్పర్శచే పాతివ్రత్యప్రభావమంతయు, రూపమును ధరించి. యెదుట తాండవమాడ, జోహారొనర్చి, రాధాకృష్ణ స్వరూపములలో లీనమైతినో, ఆ రాధనా? నేను చంపుకొనుట! ఆ పతివ్రతాతిలకమునా? వధించుట! ఆ పతి

సేవాపరాయణనా? నిర్మూలించుట! సామాన్యప్రజలను గూడ కన్నబిడ్డలవలె ప్రేమించు ప్రేమస్వరూపిణినా? ఖూని యొనర్చుట! అసంభవము. ఒక వేశ్యకై కాముకీకృతయగు వేశ్యకై, ధనదేవత నారాధించుచు, నుచ్చనీచము లెరుంగక, మానాభిమానముల విక్రయించి, మధుపానమత్తయై సంచరించు కులటకొఱకా? నీ రాధను వధించుకొనుట! అసంభవము (ఆగి) కాని, రాధా నీవు మరణింపక తప్పదు. నీ సద్గుణజాలమే నీ కాగర్భవిరోధులైరి. పుష్పం సామాన్య వేశ్యగాదు, ఆమె రాధ ననేకవిధముల మించగల, సౌందర్యజ్యోతియని నా యనుభవము తెల్పుచున్నది. రాధ జీవించియున్నంతవరకు, పుష్పమునందలి మధువును తనివితీర గ్రోలజాలను. రాధా మంగళసూత్రము నేను యాచించినపుడు, నా ముఖమును నా దీనస్థితిని, నిస్సహాయత్వమును, పరాభవమున దందహ్యామానమైన, హృదయమును సూచించుచున్నను, మంగళసూత్రమునకు, లేని ప్రాధాన్యమిచ్చి, నన్నవమానించి, శుష్కవేదాంతమును బోధించు నీవా? పతివ్రతవు! నీవా? సద్గుణరాశివి! నీవా? పతిసేవాపరాయణవు? లోకమును సాధ్వియను, నామమున, వచింపనెంచు కృతఘ్నురాలవు. కాని నీ కృతఘ్నతకు పాపమనుభవింపుము, పుష్పం నీవు నా సౌఖ్యములను పెంపొందింప జేసితివి. ఈ రాధ లోపించినచో, నా వలసిన ధనము ప్రాప్తించును. అపుడు మనము సౌఖ్యముగ నుండవచ్చును. కాని నీవు మాత్రము కులటవు కావా? ధనమునకై నన్ను వెతలను బెట్టలేదా? ధనములేనిచో సౌఖ్యము లభించదని పలుకలేదా? పుష్పమునకై రాధను నేనేల వధింప

పవలయును? కాని రాధవలన నాకుగల్గు సంసారసౌఖ్య మెట్టిది? ప్రేమలేనప్పుడు సద్గుణములు నిరుపయోగములు. నిజముగా నాలోచించినచో, రాధను నే నెందులకు జంప వలెను? ఆ హత్యవలన జరుగులాభమెట్టిదో నేను గ్రహింప లేకున్నాను. నా మెదడు పాడగుచున్నది. శత్రురాజమా! యువతీకంఠరక్తపిపాసనుఱ్ఱూతలూగుచు నన్ను పరవళ్ళు ద్రొక్క జేయుచుంటివి. ఎవరిహస్తమును నీ వలంకరించెదవో, వారి నంధులగజేసి, ఉన్మత్తులగావించి, వివేకభ్రష్టులనుజేసి అధఃపాతాళమునకు, గొనిపోవుదువు. కానిమ్ము! నీ యిచ్ఛ వచ్చినట్లే కానిమ్ము! రాధ మరణించుటచే లాభమున్నను లేకపోయినను ఆమె జీవించుటవలన నా కేమియు లాభము లేదు. పైగా పుష్పానందమునకు, యీమె యడ్డువచ్చుచున్నది ఈమె మరణించినచో, పుష్ప హృదయమున, సానుభూతి, యుదయించి దిక్కులేనివాడనని, ప్రేమించి సదా తన హృద యమున హత్తికొనియుండునను, మూఢవిశ్వాసమునకు దాసు డనై, యీమెను వధించుటయే! మేలనినిశ్చయించితిని. కాని. నన్నకుమారుని గతియేమి? మాతృవిహీనుడై నిరంతరదుఃఖ ముల ననుభవించుటకు, ఆత డొనర్చిన తప్పేమి? మమకారము లేక స్వార్థపరుడనై కుమారుని కుత్తుకనుగోయుటన్యాయమా? ఛీ! న్యాయాన్యాయములతో, నా కవసరము లేదు. నా సౌఖ్య మే నాకు కావలయును. నా పుష్పము సంతోషితస్వాంతయై, కాళ్ళనందియలు ఘల్లుఘల్లుమనిమ్రోయ నృత్యముజేయుచు సమీపించి ముఖమును చుంబించి, నాథాయని కౌగలించు టయే నాకు కావలెను. ఆమె గాఢాలింగనములో లీనమై

విశ్వాములు మరచుటయే నేనపేక్షించునది, పుష్పమే నా సామ్రాజ్యము! అదే ఆరాధ్యదేవత! ఆమెయే సత్యము. ఆమెయే లోకమును, తన సౌందర్యశక్తిచే, సృష్టించి లాలించి పాలించునది. ఆమె యాజ్ఞయే శిరోధార్యమను నాపుష్పం. అట్టి ఆమెను సంతోషింపజేయుటకై, నా పుష్పముఖమునుండి పరిణయవాక్యములను, వినుటకై నా పుష్పము సమీపమున నిలిచి, ఆమె నేత్రములనుండి ప్రవహించు ప్రేమామృతమును తనివిదీరగ్రోలుటకై రాధనేకాదు వేయిరాధలనైనను కను విప్పుకాలమున సంహరించెదను. ఆలోచింపను. అపాయమును నేనెరుగను. రౌరవనరకాగ్నికి జంకను. నా హృదయమును దుద్భవించు ప్రశ్నపరంపరలకు సమాధానమియ్యను. ఇది నా నిశ్చయము. కృపాణమా! రాధను వధింపుము. ఆమె రక్తముతో తృప్తినొంది పుష్పసహవాసమున మదనసామ్రాజ్యమేల నన్నాశీర్వదింపుము. (కత్తినెత్తి) నిద్రించువారిని వధించుట, కృపాణము ధరించినవారికే యవమానము. రాధా! (లేపును)

రాధ—(లేచి నైఖరి దిలకించి) నాథా! ఈ సువర్ణావకాశము లభించునని యే నేను తలంచితిని. పతివ్రత తన భర్తకోసం త్యాగం జేయగల సర్వోత్కృష్టమగు నుపహారము జీవితమే కదా!

కృష్ణ—రాధా! నీతో చర్చించుటకు రాలేదు. నా నిశ్చయమును మరల్చుకొనుటకు, సాధ్యముకాదు. కృష్ణారావు ఆనందించుటకు నీవు మరణింపవలెను.

రాధ—ప్రభూ! నా కొక్కటే విచారముగలదు. నేను మరణించినను మీ కానందము కలుగదను విచారము.

కృష్ణ—కారణమేమి?

రాధ—మీరారు పతివ్రతాహృదయమును, పవిత్రప్రేమను, గుర్తింప జాలక ఎండమావులవంటి వేశ్యా హృదయమును వెంటాడి పరుగులెత్తుదురే!

కృష్ణ—పురుషుని నిన్ను గ్రహింప లేదు.

రాధ—అవసరము లేదు. మీ దీనస్థితియే, మీ మలినాంబరములే మీ నిరంతరచింతాసలతఫలములే, ఆమె హృదయమును సూచించుచున్నవి. ఆమె హృదయము పవిత్రప్రేమను రుచిచూచినచో పరుల దుఃఖములలో పాల్గొనుచు, వ్యక్తిత్వము నిర్మూలించుకొని, ఆనంద మనుభవించు పవిత్రప్రేమను అర్థముచేసికొనినచో, త్యాగమే ప్రేమకు రూపాంతరమను భావమామె హృదయమున చిరస్థాయిగనుండినచో, ఈ కృపాణము మీ హస్తమున నలంకరింపగలదా? ఈ కృపాణమునే ప్రశ్నింపుము. వారవనితలు తాము వలచినవారి హస్తంబుల మరణించిరో లేక వారినే దురాశాభూయిష్ఠలై యమసదనంబుల నంపిరో! తెలియును. నాథా! నేను మరణించుటకు సిద్ధముగ నుంటిని. కాని మీ మనోరథము, నెరవేరదను, భయమే నన్ను పీడించుచున్నది.

కృష్ణ—రాధా! నీ మాటలు నా హృదయమును కలచివైచుచున్నవి నా నిశ్చయమును భ్రమింపజేయుచున్నవి.

రాధ—అనేక పరాభవకారణములు భయంకరస్వరూపముతో నగ్న సత్యస్వరూపము ధరించి, పై మెరుగులకు తావీయక వలపు లాది బాహ్యాడంబరములను నట్టి కామిని కర్కశహృదయమును స్వార్థసంకోచితచిత్తమును ప్రదర్శించుచున్నవి. పురుష్

కృష్ణ—రాధా నీవుబోయి వానిని గొనిరమ్ము!

రాధ—(వెడలును)

కృష్ణ—ఛీ! నా జీవితమెంత యసహ్యాకరముగ మారినది. భారత మాతృగర్భమున జన్మించి గౌరవముగ కొంతకాలము జీవించి మరల నేవిధమున నీచస్వభావముతో, ప్రజలను గన్నెత్తెదను? ఆత్మహత్యయే శరణ్యము! నేను బ్రతికియుండిన యీ నా ముఖమునుజూచిన ప్రతిభారతనారీరత్నమునకు భయమొదవును. పాతివ్రత్యభంగము గల్గును. దేశమాత నన్ను జూచి నేడ్చును. (కత్తితో పొడచుకొనబోవును.)

(రాధ, యోగి ప్రవేశింతురు.)

రాధ—అమ్మయ్యో! ఇదియేమి (కత్తిని లాగికొనును) నా కిక సుదినములు ప్రాప్తించినవని యానందించుచున్నాను. మీరు లేనిచో నా కిక జీవితమెందులకు?

కృష్ణ—రాధా! ఈ పాపికన్నులు దెరచిచూచెనా, నీ పాతివ్రత్యము చెడును. నా కింక ఆత్మహత్యయే శరణ్యము!

యోగి—నాయనా! మానసికముగ నీ యంతరాత్మహత్య గావింపబడినది. ఇంక భౌతికకాయమునకేల హత్య? ఏమి నాయనా! ఇంతటి ఘోరకార్యమునకు బూనుకొంటివి? ఆత్మహత్య మహాపాతకమని యెరుంగవా? అందువలన ఏ జీవికి స్వర్గప్రాప్తియుండదు.

గీ. చావనేల నీవు • చేజేతదగునయ్య
చింతబొందుచుంటి • వంతియదగు

పాపపంకిలమును ♦ బారద్రోలును జన్మ
ఆత్మహత్యయేల ♦ నధమ బుద్ధి.

పాపశిక్షలకంటెను నరునకు పశ్చాత్తాపముఖమటయే గొప్ప శిక్ష. అట్టి పశ్చాత్తాపము నీకు కలిగినది! ఈ నీ సామ్రాజ్యం సుఖముగా కాపురము జేయుచు బరమేశ్వరునిగూర్చి సదాధ్యానము సల్పుచుండుము. వ్యభిచారముచేసి తాగినట్టు వ్యభిచారమును నిర్మూలముచేయుము.

ప్రద్యు—ఈ దుర్మార్గునకు పశ్చాత్తాపమాత్రాన పాపములు బోవునా?

సీ. అగ్నిసాక్షిగ బెండ్లి ♦ యాడిన యతివను
హత్యసేయగనెంచు ♦ నధమనరుడ
తండ్రిని మరపించు ♦ దయనుజెంచినవాని
దూలనాడినయట్టి ♦ తుచ్ఛజనుడ
తాతలగడనను ♦ దగుదునమ్మియంచు
త్రాగనమ్మినయట్టి ♦ పోగరుబోతు
చదువులనేర్చియు ♦ సద్వర్తనమువీడి
పలుగాకినైనట్టి ♦ పందనేను

గీ. అట్టి యీ రౌడికెక్కుడి ♦ యాత్మశాంతి
మరణమొందెదనిక ♦ నేను మనగజాల
ఖడ్గరాజమా! ఇదిగో యీ ♦ ఖలుని వేగ
భూమికిని భారమోనరింపు ♦ మొక్కుచుంటి.

రాధా—తగును నాయనా! నీ వొనర్చినది యీ నీ భార్యకేగదా! శీఘ్రము మేలుగ బరిణమించినది. ఇక సుఖంబుండుము.

ప్రద్యు—(రాధ చేయిబట్టుకొని) రాధా! పతివ్రతలలో మిన్నవుకదే! నా జీవితరాణివి! నిన్ను వివాహమాడిన నా జన్మయే జన్మ!

మో. — మీ ప్రేమ కిక నెట్టివిఘ్నములు లేక నాచంద్రార్కము వర్ధిల్లునుగాక.

సీ. వారకాంతల పొందు ♦ వలదు కుమారకా
కాలకూటవిషంబు ♦ కాదె? గణిక!
మద్యపానాసక్తి ♦ మానుము సోదరా
సర్పాలపుట్ట యీ ♦ సారకాదె?
భగవంతుడే లేడు ♦ స్వార్థంబె ముఖ్యమను
వాదంబులను వీడి ♦ వరలుమయ్య
ఇహపరలోకంబు ♦ లెప్పుడు తలపోసి
దానధర్మంబుల ♦ దనివిజేయు
గీ. మయ్య భార్యయె సంసార ♦ మగ్నునరుని
నుద్ధరింపంగ జాలిన ♦ సిద్ధమాత్ర
ప్రేమయే మోక్షసామ్రాజ్య ♦ మేలు మంత్ర
మిద్ది మఱువక జీవింపు ♦ మెల్లదనయ.

(ఆశీర్వదించును.)

కృష్ణ — ఇక మా పనులను నిర్వర్తింతము రమ్ము!

తెర వ్రాలును.





# పుష్పరాజ్యం లేక రాధాకృష్ణ.

## పంచమాంకము.

### మొదటిరంగము.

పుష్ప:—(తన గదిలో కూర్చుండి) నీతిగా బ్రతుకవలెనని యెంత యత్నించుచున్నను, ఏ నిముసమున కా నిముసమెవఁడో యొకఁడు, ఆగలుచుండును గదా! విటులలో వివిధవిశేషప్రజ్ఞలుగల వారుగలున్నారు. వారి విలోలచేష్టలజూచి నంతియు సంతసింపదు నా మానసము.

సీ. సిరియున్నవారిల ♦ నిజముగ లేరన్న
నుబ్బి మిన్నంటెడు ♦ యోధుఁడొకఁడు
గడియార మెంతయో ♦ గాన్పింపనుంగరాల్
ముక్కు మొగము తుడ్చు ♦ మొద్దొకండు
చిల్లరడబ్బులు ♦ జేబున వైచియు
ఘల్లుఘల్లనిపించు ♦ ఘనుఁడొకండు
అప్పున్నవారల ♦ నచటికేరమ్మని
గొప్పకు గద్దించు ♦ కూళయొకఁడు

సీ. తనకు వచ్చినయింగ్లీషు ♦ దప్పకచెలె
యేకరును బెట్టి వాగెడు ♦ హీనుడొకడు
ఇటుల బాధలజెందెదెక్ ♦ విటసమూహా
మేమి చెప్పుదు వెగటౌను ♦ శ్రీమలజూడ!

ఈ విధముగానే వెఱ్ఱిక్కెల్లాగుంటాను విటులంతా! అసలు ఊళ్ళో సానరకం, పుట్టింట కోడరికం, అత్తింట నిల్లరికం, పనికి రావు. ఊళ్ళోని విటులమాటలను 'ఊ' కొట్టుతూంటే, ఊపెకి వస్తూ పోతూయుండడమేగాని, ఊకపరక్కైనా - ఉపకారం చెయ్యరు! సరికదా జాగ్రత్తయని బెదరింపులూ! కాని యిక కృష్ణారావునుగూర్చియే నా చింత! ఆ! పిచ్చి! వీడుమాత్రం నన్నేమి చేయగలడు. సరే! కృష్ణారావు వచ్చే వేళయింది. ఈ మధ్య సీతని ప్రవర్తనలో బరిణామ మించుకించుక గల్గు చున్నట్లు వింటినిగదా! ఇకపైని నాతనికడ జాలబెట్టుగనుండి, విమోహితుని జేసి బ్రతిమాలించుకొని యికపైని నా చెప్పు చేతలలోనే యుండునట్లు వాగ్దానం చేయించుకొంటాను. (పెడమొగముతో కూర్చుండును.)

కృష్ణ—(ప్రవేశం) ఓహో! యేమి మా యదృష్టము: మా రాణీగా రైన పుష్పంగారికి నేడు సంపూర్ణాగ్రహాంకల్గిందే?

పుష్ప—(కోపముతో) కలుగుతుంది! కలుగదూ? ఇంట్లో కేమి కావలెనో కనుక్కోనక్కర్లేదు.

కృష్ణ—అరే! పాపం! అసలు నీ వంట్లో బాగుంటోందా?

పుష్పం—ఏలా బాగుంటుంది? మానవజన్మ యెత్తినతర్వాత, నీతి యుండవలెనుగాని - కంటికి కనుపించిన ప్రతిఆడుదాన్నినా?

కృష్ణ—ఓహో! అదా నీ ఆరాటం. నీవు పుస్తెగట్టిన పుష్పానివి! వారు కానివారున్నా? నీ కంత కడుపుమంటయేల?

పుష్పం—నాకు నుంటగానుండదూ? మిమ్ముల్లను నమ్మియున్నప్పు డాబుదాని నిట్లుజేయవచ్చునా?

కృష్ణ—అదీసంగతి! (నవ్వి) నిజము గ్రహించితివి. కట్టుకున్న యాలి నే లెక్కసేయక నిప్పటివరకు - యీ నిమిషమువరకు - ఈలా తిరుగుచున్నానుగదా! నీ వంటి సానిమాట లెక్కింతునా?

పుష్పం—(కోపముతో) ఏమది? ఈ నాటికి నేను సానినైనానా?

కృష్ణ—సానివిగాక సంసారివాయేమి? (నవ్వుచు) పైగా ఒకప్పుడు సాని, మరొకప్పుడు సంసారియూనా? అట్లయిన నీవు సాని సంసారివన్నమాట!—

పుష్పం—అనవసరంగా మాట్లాడకండి! మీరు సీతిలేదేమోగాని, నాకున్నది! ఎందరనో తిరస్కరించి మిమ్ములనే, నమ్మికొన్నందుకు, మీరు చేయవలసిన దిదియా?

కృష్ణ—అయితే పాతకాతాలను స్వస్తిచెప్పి నన్నుమాత్రము, క్రొత్త చిట్టాలో, బ్రాతోవరు చేశావన్నమాట!

పుష్పం—అనవసరంగా, నన్నగౌరవం చేస్తున్నారు! శెట్టిని, శాస్త్రిని గూడా అడగండి. మీ మీద నా యభిప్రాయమేమో తెలుస్తుంది.

(శెట్టి, శాస్త్రి ప్రవేశం.)

కృష్ణ—సమయానికే వచ్చారు సరిగ్గా! ఈవిడ శీలవతియట! నిజ మెంతవరకో, మీ కేమైనా తెలియునా?

కృష్ణ—బస్ ! బస్ ! చాలించు. పెద్ద కేకలు వేయవద్దు.

పుష్పం—కృష్ణారావ్ ! ఆ మాత్రము నేను గ్రహించలేనా ? నా నారసాలు చూపించిన నటకుడవని, ఆశ్రయించినవాళ్ళకి అభయహస్తమిచ్చే శృంగారపురుషుడవని నాకు తెలుసు.

కృష్ణ—పుష్పం ! హృదయములోనున్నమాట స్పష్టంగా చెబుతున్నాను. నీ మీద ప్రేమ లేదు. నా హృదయం అన్యథాయత్తమైనది. ప్రేమపాత్రిక యెవతైనది నీకవసరము లేదు.

పుష్పం—పరియాచకమునకా మీరు పల్కునది ?

కృష్ణ—కాదు. నీవు వేశ్యవేలయినట్టుంటే ధనముకోసము నన్నిబ్బంది పెట్టియుండవు. కాబట్టి నీవు నా వస్తువవుకావు.

శెట్టి—చవక బేరాలన్నీ షావుకార్లకే ! కనుక పుష్పం ఏమంటావ్.

శాస్త్రి—చచ్చుల్లిపాయమ్మ నీవాడికి పెర్మనెంటు సానెందుకురా ?

శెట్టి—అబ్బే ! షావుకారికెందుకు ? పీనుగులు మోసే భావనాశక్తి ఉంటే తద్దినం వంటలయినా చేస్తుంది. ముత్తయిదువ పనికిరావడం నీకూ లాభముంటుంది.

శాస్త్రి—పుష్పం ! మదనసామ్రాజ్యంలోగల మర్మాలు కోమటి కేమి తెలుస్తుంది? సరదాలు తీరాలంటే శాస్త్రులుగారి సావాసం ఉండాలి.

శెట్టి—అవును కాబోసు మరి ! ఆ పిలక, బిళ్ళగోచీ, ఆ జారీచెంబు మదనసామ్రాజ్యానికి కావలసిన సామగ్రి కదా ? ఎర్రిమొగమా యిన్ని రోజులు ఘంచివిగావు. రేషనింగ్, కిరసనాయిలు కంట్రోలు చిల్లర యిబ్బంది - ఓ ఎన్ని లాభాలుంటాయో ఆలోచించుకో ?

కృష్ణ—(సవ్యాశూ) పుష్పం స్వయంవరం ప్రారంభించు.

శెట్టి—ఒరి బాబోయ్! నీవు మాత్రం నా వేషంలో సిద్ధపడకసుమా అప్పుడు దనుయంతిపడ్డ బాధే పుష్పం పడవలసివస్తుంది.

శాస్త్రి—పుష్పానికి ద్వితీయ స్వయంవరం అక్కర్లేదు. శాస్త్రి కా పట్టించవంటే శాశ్వతంగా రిజిష్టరై యుండవలసిందే?

కృష్ణ—పుష్పం, వెళ్ళుస్తాను. ఇన్విటేషన్ కార్డుమాత్రం పంపించు ఇద్దరు స్నేహితులేగా? (వెళ్లును.)

పుష్పం—ఎద్దుపుండు కాకికి నొప్పా అని ఎవరిష్టంవచ్చినట్లు వాళ్ళు వాగుతున్నారు. ఇక భక్తిమార్గమున యుండుటకంటె వేరే మార్గములేదు. (వెళ్లును.)

తెర వాలును.

స oపూ ర్ణ ము.

